JAGATI | Rs. 3-00 | Nov. 1987

33rd Year of Publication

# జగతి

ఎడిటర్ : చందూర్

దీపావళి – 1987



'ఆధునిక రచయిత మదిలోని 'మధుమతి'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : పండిట్ నెహ్రూ

# నిమ్మతొనలు

నింగి సాక్షిగా, నేల సాక్షిగా, భూమ్యాకాశములసాక్షిగా, పార్వతీ పరమేశ్వరుల సాక్షిగా, అగ్నిసాక్షిగా, సర్వ భూతముల సాక్షిగా, సంతలో వంకాయల సాక్షిగా, తారకరామాలో 'మయూరి' సాక్షిగా, మీ అమ్మా నాన్నల సాక్షిగా నిన్నే పెళ్ళాడి తీరు తాను అశోక్'' అంది ఆవేశంగావసంత కుమారి.

'వంకాయ సాక్షిగా బెండకాయ సాక్షిగా నీ సాక్షిగా పంచభూతములు సాక్షిగా నువ్వు నన్ను పెళ్ళాడ లేవు. ఎందుకంటె ఆల్ రెడీ మా మేన కోడలుతో సెటిల్ అయిపోయింది. వస్తా, వసంతా.. గుడ్ బై. చీర్‌యో'

—కె రామకృష్ణ
రేపల్లె

'ఈ సీన్‌లో అసలు సిసలైన బ్రాందీ యే కావాలి – లేకపోతే కుదరదు' – అని పేచీ పెట్టాడు సినీ హీరో.

'అయితే ఈ సీన్ అయిపోయాక విషం త్రాగాలి. అది ఒప్పుకుంటె బ్రాందీ తెప్పించడానికి నాకేం అభ్యంతరం లేదు' – అన్నాడు డైరక్టర్.

—కె నాగేశ్వరరావు
నరసరావుపేట

గోపితో నీ ప్రేమ వ్యవహారం దెబ్బ తిందటగా నిజమేనటే రాధా ?....

'అవునే – అతను ఒట్టి పిచ్చాడిలా ఉన్నాడు. కానీ కట్నం తీసుకోకుండా నన్ను చేసుకుంటాడట – అందుకే అతన్ని వదిలేశా, సరోజా....'

—జి మాధవి
నందిగామ

ఇంద్రజాలం చేస్తున్నాడు ఒక కుర్ర మెజీషియన్. 'చూడండి, ఈ గ్లాసులో ఓ గులాబీ పువ్వు ఉంది – మీకు కన్పిస్తోందా ?'

'ఆ, కన్పిస్తోంది' అని అరిచారు ప్రేక్షకులు. 'అయితే ఇప్పుడు చూడండీ – ఈ గ్లాసులోని పువ్వు గనకా ఎవరికైనా కన్పిస్తే వాళ్ళు పరమమూర్ఖులు, మరి ఎవరికైనా కన్పిస్తోందా ఈ గ్లాసులో పువ్వు?' మళ్ళీ పెద్దగా అరుస్తూ అడిగాడు మెజిషియన్. 'లేదు – లేదు కన్పించటం లేదు' అంటూ ప్రేక్షకులంతా పెద్దగా అరిచారు.

—జి రాము
నందిగామ

భర్త గురించి గొప్పగా చెప్తూ రాధిక 'మావారిని నేను ఒక నవలలా చదివేయగలను' అంది, శాంతితో.

'అదేమో గాని ఆ పుస్తకాన్ని మాత్రం నీ లైబ్రెరీలోనే ఉండేటట్లు చూసుకో' అంది శాంతి.

—కె రుక్మిణి
కాకినాడ

'తలుపు తియ్యి - తలుపు తియ్యి' 'వీధి లైటు క్రింద నిలబడి తలుపు తియ్యమని గొంతు చించుకుంటున్నా వేమిటి ?'

'పైన లైటు వెలుగుతుంటే ఇది మా ఇల్లనుకున్నాను' అన్నాడు నిషాలో వున్న ఆ పెద్ద మనిషి.

—అమ్మాజీ సర్కార్
ఆల్‌హాస్పా

'జీవితంలో మీరు మరచిపోలేని రోజు ఏమిటండి ?' సిగ్గుపడుతూ అడిగింది మ్యారేజీ యానివర్సరీ డే రోజున కాదంబరి.

'—పోలింగ్-డే' అని సిగ్గు విడిచి చెప్పాడు కొత్తగా రాజకీయాల్లో చేరిన భర్త రాజారామ్

—వి వెంకటేశ్వర్రావు
రుద్రారం

ఒక విదేశీ వనిత విమానం దిగి తన టైమ్ కరెక్టు చేసుకుందామని ఒక భారతీయుడిని టైమడిగింది.

"ఫైవ్ థర్టీ మేడమ్" అన్నాడతను.

"ఇది జి.ఎమ్.టి (గ్రీనిచ్ టైమ్) కదా?"

'కాదు, మేడమ్ - ఇది హెచ్. ఎమ్.టి.

—జి యస్ శర్మ
అమలాపురం

నువ్వు రోజుకో వాహనంపై తిరుగు తావని జ్యోసం చెప్పాడుగా - ఏమైంది' -

"నిజమే, అయింది" అన్నాడు సుగుణ్ "మంచిఆఫీసరుఉద్యోగమా ?"

"కాదు, లారీ క్లీనర్‌ని రోజుకో బండి"

—సెల్వి
నందిగామ

# పాఠకుల తీర్పు

డియర్ చందూర్ గారికి: నమస్కారములు. ఈ మధ్య వస్తున్న నవలలు, మనిషికీ మనిషికి మధ్యగల విలువల్ని తెలియనీకుండా చేస్తున్నాయి. ఎంత సేపూ క్రయిమ్, సస్పెన్స్, మర్డర్స్ నానా చెత్తా చెదారం. వాటికి పూర్తి విరుదంగా ఉంది అచ్యుతవల్లిగారి 'భ్రమర గీతం'. ఆత్మీయత, ప్రేమ, బాధ్యతలు, బంధాలు, చాలా చక్కగా తెలియ జేస్తున్నారు. 'ప్రతి గురువారం' లోని ప్రతి అక్షరం మనసున హత్తుకు పోతోంది.

—జి రాము

నందిగామ

చందూర్ దంపతులకు: మద్రాసు నుంచి కల్పకం వచ్చి చెప్పేవరకు, 'జగతి' చదివేవరకు ఆ వివరాలు తెలియలేదు. 'ధర్మం తలై కాక్కుమ్' అనే తమిళ లోకోక్తి మీపట్ల నిజమయింది. . . 1967 లోనో 68 లోనో వరదవల్ల ట్రయినులు ఆగిపోతే, నేనూ పిల్లలూ (నా నగలన్నిటితోసహా), రెండు రోజులు ట్రయిన్‌లో తిండిలేక పడ్డ అవస్థలు, తర్వాత టాక్సీవాడు నగలున్న పెట్టె తప్ప మిగతావన్నీ టాక్సీలో పెట్టి, ఆ పెట్టెకి చోటులేదని గొడవ చేయడం, వరదలవల్ల చీకటి, ఆ చీకట్లో నన్నూ పిల్లల్నీ విజయవాడలో ఎక్కడో హొటల్లో దింపడం, నా దగ్గర ఇరవై మాత్రమేవుంటే డెబ్బయి రూపాయిలు కావాలని గొడవ చేయటం - యిలాటివి యిప్పటికీ తలుచుకుంటే నైట్‌మేర్స్: ధైర్యంగా మొండిగా నెగ్గుకు వచ్చాను .... ఎందుకు రాస్తున్నానంటే, ఇలాటి సంఘటనలు మన మీద ఎలాపని చేస్తాయో నాకు బాగా తెలుసు. మీ రిద్దరూ నిజంగా చాలా అదృష్టవంతులు.

—వి రాధ

బొంబయి-22

చందూర్‌జీ : నాకు ఎప్పటినుండో ఒక ప్రశ్న, ప్రశ్న గానేమిగిలిపోయింది. ఎంతగా ఆలోచించినా జవాబు దొరకలేదు... శకుంతల, దుష్యంతుల కుమారుడైన భరతుడు పాలించిన దేశం కావున భారతదేశం అనే పేరు వచ్చింది అని పాఠాల్లో చదువుకున్నాము. . . . భారతమాత చిత్రంలో ఒక చేతిలో జాతీయ జండా, మరొక చేతిలో త్రిశూలం వుంటాయి— ఎందుకని ? . . . రాముని సోదరుడైన భరతుని పేరు మీదుగా, యిది భారత దేశమయిందని ఈ మధ్య మరొకచోటచదివాను....!ఇందులో ఏదిరైటు?

—అమ్మాజీ సర్కార్

ఆల్ హాస్పా—కెఎస్‌ఎ

# ప్రాచీన సాహితి



లలిత నికేతన ప్రియ విలాసవతీ ధవళాత పత్ర స
ద్విలసిత వైభవం బనుభవింప బడున్ సుకృతానువృత్తిచే
చెలువగు పుణ్యకర్మము నశించిన నంగజ సంగర త్రుటి
త్స్ఖలిత గుణోరు మౌక్తిక నికాయము లట్లు దొలంగు సంపదల్



తనయుపై గలభక్తి తల్లిదండ్రుల మీద
　గలుగు నేర దదేమి కారణంబొ
ఇంతిపై గల ప్రేమ యిష్టదైవము మీద
　లేదు నరుల కెట్టి లిఖిత ఫలమో
ధనముపై గల బాళి ధర్మమార్గము లందు
　దలపగూడ ద దెట్టి దైవఫలమో
తన ప్రాణములు మాడ్కి ధరణీజీవుల నెల్ల
　గలయ జూడ రదేమి కర్మఫలమో
సరసిజాసనుడీ రీతి సర్వజనుల
మోహ జలరాశిలో సదా మునుగ జేయు
ప్రణుత ధవళాంగ మౌనిహృత్పద్మభృంగ
అమిత భవభంగ శ్రీ కాళహస్తి లింగ

—కాళహస్తి లింగశతకం



డాసిన నింగితం బఱిగి డాయగ నేరక తత్తరంబునం
జేసిన సేతకున్ బదులు సేయ నెఱుంగక, మేను మేనితో
రాసిన యంతనే కళలు రంజిలి కౌగిట బాల యుండె బో
యా సుఖ మింతయంత యనవైనది గాదు గదయ్య క్రీడికిన్

—చేమకూర వేంకటకవి 'విజయవిలాసం'

# పాతికేళ్ల నాటి పిక్చర్

## రాజ్యలక్ష్మి వారి 'రక్తసంబంధ'

అన్నా చెల్లెళ్ళ మధ్య నుండే ప్రేమానుబంధాన్ని ఆదర్శ శిఖరపు టంచులపై ప్రతిష్ఠించివేసి, ఆ బంగారు కాంతిని వెండితెరలో చూపబోయారు నిర్మాతలు. అసందర్భమగు సన్నివేశాలు అనేకం సృష్టింపబడినప్పటికీ, విభిన్న మనస్తత్వాలు తీర్చిదిద్దడంలో శ్రద్ధ వహించి, సామాన్య జనాభిరుచికి అనుగుణంగా తయారు చేయగలిగారు ఈ చిత్రాన్ని. కార్మిక సంఘాలంటే జడుసుకునే సామాన్య వ్యక్తి, ఆటబొమ్మలు అమ్మి లక్షాధికారి అవడం ఎంత అసంభవమో, ఈ చిత్రంలోని కష్టపరంపరలూ అంతే! స్త్రీ విలన్ (సూర్యకాంతం)తో తప్ప కథని నడపడానికి, పరిష్కరించడానికి మార్గం కనబడలేదు..........

....అనగా అనగా ఒకరాజు (ఎన్.టి. రామారావు) వున్నాడు. అతనొక మిల్లు కార్మికుడు. అదే మిల్లులో ఆనంద్ (కాంతారావు) కూడా పని చేస్తుంటాడు, సమ్మె కారణంగా మిల్లు కట్టేస్తారు. రాజు, తన చెల్లెలు రాధ (సావిత్రి) దాచిపెట్టిన వెయ్యిరూపాయలతోను బొమ్మల కంపెనీ పెడతాడు. అతి తొందరలోనే కార్మికుడు రాజు, కాపిటలిస్ట్ అయిపోతాడు. ఆనంద్‌కి తన కంపెనీలో పని యిస్తాడు. మొదట్లో అప్రదిష్ట అనుకున్నా, రాధ ఆనంద్‌ల వివాహానికి సమ్మతిస్తాడు.........

....ఆనంద్‌తోబాటు అతని మేనత్త (సూర్యకాంతం), చల్లగా సాగిపోతున్న సంసారంలో అడుగు పెట్టడంతో మామూలు అనుమానాలు, అనుకోవడాలు ప్రారంభమవుతాయి. రాజు భార్య మాలతి (దేవిక) మనసు విరుస్తుంది ఆ లేడీ విలన్. కలతలు, కలహాలు ప్రారంభమవుతాయి. ఆడపిల్లని కని మాలతి చనిపోవడం, ఆపైన అన్నా చెల్లెళ్ళ కన్ను మూయడంతో గాని చీకట్లు చెదరవు. రేలంగి, గిరిజ, రమణారెడ్డి, హాస్యంతో, పదునైన సంభాషణలతో అందరూ 'బావుంది' అనుకునే చిత్రం ఇది.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - నవంబరు 1962



మానవుని మెదడు చాలా గొప్పది. పుట్టినపట్నుంచీ అది విరామం లేకుండా పనిచేస్తూ వుంటుంది — ఒక్క క్షణం కూడా ఆగదు. ఉపన్యాసం యిచ్చేందుకు వేదిక ఎక్కినప్పుడు తప్ప! —హాఫ్‌మాన్

మనం పథకాలు వేయగా, మనకి సంభవించేదే జీవితం —సాంటర్స్

వెనకటి తప్పులు మళ్లీ చేయడం గాక, కొత్త తప్పులు చేయటాన్ని 'అనుభవం' అంటారు. —ఈనోస్

# వెన్నెల కెరటాలు

## సంక్షోభం

నేటి చిత్ర పరిశ్రమ సంక్షోభంలో పడిందనేది వాస్తవం. ఇందుకు ఒక వ్యక్తో ఒక వర్గమో కారణం కాదు, దీనికి సంబంధించిన అందరికీ బాధ్యత ఉంది. ఇది ఎవరి చేతుల్లోనూ లేదు. బియాండ్ లిమిట్స్‌కి వెళ్ళిపోయింది. కారణం ఏమిటని ప్రశ్నించుకుంటే— ఓవర్ ప్రొడక్షన్ ముఖ్య కారణంగా కనిపిస్తోంది. పది సంవత్సరాల క్రితం వరకు 50 నుంచి 70 వరకు చిత్రాలు విడుదల అయ్యేవి సంవత్సరానికి. ఇప్పుడు 200 చిత్రాల వరకు తయారయి విడుదల అవుతున్నాయి. దీనికి కారణం అనేక మందిని చిత్ర పరిశ్రమ ఆకర్షిస్తోంది. ఈ నిర్మాణం ఎలా జరుగుతోంది అన్నది చిన్న ఉదాహరణతో చెప్తాను. యుద్ధ సమయంలో నాణ్యతకంటే ఉత్పత్తికి ప్రాధాన్యం యిస్తారు. తెలుగు చలన చిత్రపరిశ్రమ ఈ మధ్య కాలంలో యుద్ధ ప్రాతిపదికపై చిత్రాలు నిర్మిస్తూ వస్తోంది. అంటే ఉత్పత్తికి ప్రాధాన్యం యిస్తున్నాం నాణ్యతకు యివ్వలేకపోతున్నాం. కథలలో నాణ్యత పోయిందనేది వాస్తవం. దానికీ, 'స్లాబ్ సిస్టమ్'కు సంబంధం లేదు. చిత్ర నిర్మాణం ఎక్కువ అవడం వల్ల రచయితలు బిజీ అయ్యారు. ఎంతగా బిజీ అంటే కథ గురించి ఆలోచించే సమయం వారికి లేదు. నటీనటుల కాల్‌షీట్స్ రెండు సంవత్సరాల ముందే తీసుకుంటున్నారు. ప్రస్తుతం షూటింగ్‌లోవున్న చిత్రం తాలూకూ కథ గురించి రచయిత ఆలోచిస్తాడా ? లేక రెండు సంవత్సరాల తర్వాత తియ్యబోయ్యే సినిమా కథ గురించి రచయిత ఆలోచిస్తాడా? దాంతో కథ విషయంలో అసంతృప్తి వున్నా, కాంప్రమైజ్ అయిపోవడంజరుగుతోంది. అయినా ఓ రచయిత ఎన్ని మంచి కథలను యివ్వగలడు ? యివ్వగలిగినా ఆలోచించే టైమ్ మనం యివ్వాలి కదా ?

—డివియస్ రాజు

'విజయచిత్ర'లో

## సలీమ్ ఆలీ

పక్షుల కూనిరాగాలకు అతను పరవశించాడు. పక్షుల కిలకిలల మధ్య పులకరించాడు. ప్రకృతి ఒడిలో పయనించి, పవ్వళించి వాటి గురించే ఆలోచించాడు. ప్రతిక్షణం ప్రపంచంలోని నలుదిక్కుల నుండి వీచే గాలులసవ్వడుల మధ్య విహంగాల విషాదగీతాలకు, పిచ్చుకల వెచ్చని ఉఛ్వాసనిశ్వాసాలను ఆకళింపు చేసుకున్నాడు. వాటి ఆనందంలో పాలుపంచుకున్నాడు. తన

జీవితంలోని ప్రతిక్షణాన్ని వాటి పరిశోధనలకే వెచ్చించి ప్రపంచానికి అమూల్యమైన రహస్యాలను ప్రకృతి విచిత్రాను భూతులను అందించి విజ్ఞాన భారత పర్వంలో అమరుడైనాడు. అతనే డాక్టర్ సలీం అలీ..... సరోజినీ నాయుడు మౌలానా షౌకత్ అలీ వంటి నాయకులతో కలిసి స్వాతంత్ర్య ఉద్యమంలోకూడా పాల్గొన్న అలీ "ది ఫాల్ ఆఫ్ ది స్పారో" అనే స్వీయ చరిత్రతో పాటు "ది బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" "ది హాండ్ బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" అనే ప్రఖ్యాతి నొందిన పుస్తకాలను రచించారు. "ది బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్స్" ఇప్పటికే పన్నెండు ముద్రణలను పొందిందంటే ఆ పుస్తకం విలువ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. డాక్టర్ సలీం అలీ తన జీవన సుదీర్ఘ యాత్రలో 91 సంవత్సరాలు పూర్తి చేసుకొని 1987 జూన్ 20వ తేదీ రాత్రి కన్ను మూసారు. ప్రపంచంలోని ప్రముఖ పక్షి శాస్త్రజ్ఞుడిగా గుర్తింపు పొందిన అలీ.......... భారత్‌కు ఎవలేని కీర్తి ప్రతిష్ఠలను, భావితరానికి పక్షుల గురించిన విలువైన సమాచారాన్ని అందించారు.

—ఎ

'జాగృతి'లో

## అనాస

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన పండ్లలో అనాస ఒకటి. మనదేశంలో అస్సాం, కేరళ, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ [illegible] అనాసను సాగుచేస్తున్నారు. అనాసలో 'సి', 'బి', 'ఎ' విటమినులు అధికంగా ఉన్నాయి. అనాసను పండుగా తినటానికే గాక పండ్లరసం (జామ్), చాక్‌లెట్లు, సారాయి, వెనిగార్ తయారు చేయటానికి కూడా వినియోగించవచ్చు. అనాసను డబ్బాలలో ముక్కలుగా నిల్వచేయవచ్చు. పెరటి తోటలలో తక్కువ ఖర్చుతో సులభంగా అనాసను పెంచవచ్చు..... మంచు కురవని 15-35 సెంటీగ్రేడు ఉష్ణోగ్రతగల ప్రదేశాలలో అనాస బాగా పెరుగుతుంది. 100-150 సెం.మీ. వర్షం కురిసే ప్రదేశాలు ఎక్కువ అనుకూలం. అనాసను సముద్రమట్టంనుంచి 1100 మీటర్ల ఎత్తువరకు సాగు చేయవచ్చు. మెట్ట ప్రాంతాలలో వర్షాధారం కింద కూడా పండించవచ్చు. ఇది నీటి యెద్దడిని తట్టుకొంటుంది.... బరువైన బంకనేలలు, చవిటినేలలు, ఉప్పునేలలు పనికిరావు. మంచి వడపోత శక్తిగలిగి, నీటి సదుపాయం కలిగిన ఎర్రనేలలు, ఎర్రగరువునేలలు శ్రేష్ఠం. నేలలలో సున్నపుపాలు హెచ్చుగా ఉండకూడదు.

—ఆర్ చంద్రశేఖర్

'అన్నదాత'లో



బోటని (వృక్షశాస్త్రం) అనగా అందమైన పువ్వుల్ని నోరుతిరగని గ్రీకు, లాటిన్ పేర్లతో పిలిచి అవమానించటం. —అల్ఫాంజోకార్

# మానవ ప్రగతి

## సూపర్ కండక్టర్

నేటి అమెరికా దేశం సూపర్ కండక్టర్ల పరిశోధనా రంగంలో ఇటీవల సాధించిన తాజా పురోగతిపై ఈ మధ్యనే వార్తలు వచ్చాయి. ఇప్పుడున్న సూపర్ కండక్టింగ్ పదార్థం 'మోసుకు' పోగల విద్యుచ్ఛక్తి కంటె 100 రెట్లు అధిక విద్యుచ్ఛక్తిని 'మోసుకెళ్లగల' కొత్త సెరామిక్ పదార్థాన్ని అమెరికన్ శాస్త్రవేత్తలు అభివృద్ధి పరచినట్టు ఆ వార్తలు తెలిపాయి. అయితే ఈ వార్తల వెనుక మరొక ఆసక్తికరమైన అంశం వున్నది; ఈ కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థాన్ని అభివృద్ధి పరచిన అమెరికన్ శాస్త్రవేత్తల బృందానికి భారతీయ సంతతికి చెందిన ఒక పరిశోధకుడు నాయకత్వం వహించారు. లూధియానాకు చెందిన ప్రవీణ్ చౌదరి అనే ఈ శాస్త్రవేత్త ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఐ.బి.ఎం. (ఇంటర్నేషనల్ బిజినెస్ మెషిన్స్) కంపెనీలో 1966 నుంచి పనిచేస్తున్నారు. ప్రస్తుతం ఆయన ఈ అమెరికన్ కంపెనీ శాస్త్రవిజ్ఞాన విభాగం ఉపాధ్యక్షునిగా, భౌతికశాస్త్ర పరిశోధనల డైరెక్టర్‌గా వున్నారు.....

....ఐ.బి.ఎం పరిశోధకుల బృందం కనుగొన్న కొత్త సూపర్ కండక్టింగ్ సెరామిక్ పదార్థం వల్ల ప్రపంచంలోని అత్యంత శక్తిమంతమైన కంప్యూటర్ల పరిమాణాన్ని ఒక 'ఫుట్‌బాల్ సైజు'కి తగ్గించి వేయవచ్చు. అంతే కాక, ఈ కొత్త పదార్థం వల్ల ఇప్పటి కంప్యూటర్ల వేగాన్ని సుమారు 10 రెట్లు పెంచవచ్చు. తమ బృందం కనుగొన్న కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థం ఇండియాకు ఎంతో ప్రయోజనం చేకూర్చగలదని డాక్టర్ ప్రవీణ్ చౌదరి పేర్కొన్నారు. విద్యుచ్ఛక్తిని నిల్వ చేయడంలోను, ప్రసారంచేయడంలోను జరిగే భారీ ఇంధన నష్టాన్ని ఈ కొత్త సూపర్ కండక్టర్లు పూర్తిగా నివారిస్తాయి కనుక దీనివల్ల ఇండియా బాగా ప్రయోజనం పొందవచ్చునని ఆయన వివరించారు. కొత్త సూపర్ కండక్టింగ్ పదార్థాల విషయంలో మార్గదర్శక పరిశోధనలు జరుపుతున్న వాటిలో ఇండియా ఒకటని పేర్కొంటూ డాక్టర్ ప్రవీణ్, దీనికి సంబంధించిన బెంగుళూరులోని భారతీయ శాస్త్రవిజ్ఞాన సంస్థలో ప్రొఫెసర్

సి.ఎస్.ఆర్. రావు నేతృత్వంలో జరుగుతున్న కృషిని ప్రత్యేకంగా ప్రస్తావించారు. ఇండియాలో నాలుగు అగ్రశ్రేణి శాస్త్ర విజ్ఞాన సంస్థలు సూపర్ కండక్టర్లపై ఉన్నతస్థాయి పరిశోధనలు జరుపుతున్నాయి. అవి; భాభా అటమిక్ రీసెర్చి సెంటర్, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చి, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్. ప్రవీణ్ చౌదరి మసాచుసెట్స్ సాంకేతిక సంస్థ నుంచి డాక్టరేట్ పొందారు. ఇండియాలో ఆయన లక్నోలోని 'లా మార్టినీర్' వద్ద, ఐఐటి (ఖరగ్‌పూర్) లోను విద్యాభ్యాసం చేసి, 1961లో అమెరికా వెళ్లారు.

## వానపాము

సంచారజీవి అయిన ఆది మానవుడు అవసరాల దృష్ట్యా, వ్యవసాయదారుడవ్వాలని స్థిరపడ్డాడు. అప్పటి నుండి అతడు ఎన్నడూ, వెనుదిరిగి చూడలేదు. ఎందుచేతనంటే వ్యవసాయం ద్వారా పారిశ్రామికీకరణం, పట్టణాభివృద్ధి మొదలైన సాంఘిక పురోగతులను సాధించవచ్చు. ఈ వ్యవసాయం ఇప్పుడు ప్రపంచంలోని ప్రజలందరికీ, చాలా జంతువులకి ఆహారాన్ని సమకూరుస్తున్నది. నీరు, సూర్యరశ్మి, ఎరువులు, క్రిమిసంహారక మందులు వ్యవసాయానికి కావలసిన ముఖ్య అవసరాలు అని తెలుసు. పురుగులను చాలా చోట్ల గమనించవచ్చు. వీటిలో కొన్ని వ్యవసాయానికి మంచిని,చేసేవి కొన్ని కీడును కలుగచేసేవి. మంచి పురుగులు నిస్సారమైన భూమిని సారవంతం జేస్తాయి. చెడు పురుగులను అదుపులో పెట్టకపోతే వ్యవసాయోత్పత్తులను నాశనం జేస్తాయి. ఉష్ణమండల ప్రాంతాలలో ఈ పురుగులు సంవత్సరం పొడవునా ప్రత్యుత్పత్తి సాగిస్తాయి. కాబట్టి ఆ ప్రాంతాలలో ఇవి వ్యవసాయాభివృద్ధిలో కీలకమైన పాత్ర వహిస్తాయి. వానపాములు, మానవవృద్ధికి మంచి ఉపకారులు, ఇవి మట్టిని తింటాయి. కాబట్టి వీటి విసర్జన పదార్థం కూడా మట్టియే. మొక్కల పెరుగుదలకు ముఖ్యమైన పోషక పదార్థాలను (నైట్రోజినస్ విసరన పదార్థాలు) ఈ వానపాములు తాము భుజించే మట్టికి జతచేసి విసర్జిస్తాయి. ఇవి మట్టిలో అటు ఇటు తిరుగుతూ మట్టిని కెలికి నేలను వదులుచేసి వాయువంతం చేస్తాయి. లోతుగా లేని ఉపమండల నేలల్లో వానపాములు చాలా సమర్థవంతమైన పనిని నిర్వహిస్తాయి. నిస్సారమైన లోతైన మట్టిని పైకి. తీసుకురావడంలో, సారవంతమైన మట్టిని లోపలికి పూడ్చడంలో ఈ వానపాములు యాంత్రిక నాగలి కంటే గొప్పవి అనుటలో అతిశయోక్తి లేదు. ప్రముఖ జీవపరిణామవాది అయిన ఛార్లెస్ డార్విన్ వ్యవసాయ రంగంలో వానపాముకున్న పాత్ర గురించి క్లుప్తంగా పరిశీలించి ప్రతి ఏటా ఒక

ఎకరానికి సుమారు 18 టన్నుల మట్టివానపాము ల ద్వారా అడుగు నుండి భూ ఉపరితలానికి చేరవేయ బడుతుందని లెక్కకట్టారు. దీన్నిబట్టి చూస్తే వ్యవసాయంలో వానపాము కున్న పాత్ర అమోఘమనిపిస్తుంది కదూ!

## శరణార్థులు

1987 మార్చి మాసాంతంలో పాకిస్తానీ సైనిక దళాలు రబాతె-జలీకీ యీశాన్య దిశలోనున్న టెర్రీ-జంగల్ ఆఫ్ఘాన్ శరణార్థి శిబిరంపై ఫిరంగులతో కాల్పులు జరిపాయి. తత్ఫలితంగా 30 మంది చని పొయ్యారు, 50 మంది తీవ్రంగా గాయపడ్డారు. అటు తర్వాత కొద్ది రోజులకు పాకిస్తాన్ రేడియో టెర్రే-జంగల్ శరణార్థి శిబిరంపై ఆఫ్ఘాన్ విమాన దళం దాడి చేసిందని ప్రచారం ఆరంభించింది. విప్లవ ప్రతీఘాతకుల దుష్ప్రచారానికి లోనయిన ఆఫ్ఘాన్ రైతు మహమ్మద్ తహీర్ యీ టెర్రే-జంగల్ శిబిరంలో దాదాపు ఐదేళ్లపాటు నివశించాక, ఏప్రిల్ మొదటివారంలో స్వదేశం తిరిగి వచ్చారు. ఆయన పాక్ ప్రచారపు బండారాన్ని బట్టబయలు చేశారు. ఆయన వదిలిపోయిన 30 జెరేబ్‌ల సాగుభూమి ఆయనకు తిరిగి అప్ప గించబడింది. "నేను యుద్ధం నుండి దూరంగా వుండదలిచి పాకిస్తాన్

కెళ్లాను. కాని అది అక్కడికి చేరుకుంది. జమాతె – ఇస్లామీకి చెందిన వారు మా యువకులను తమ విప్లవ ప్రతిఘాతుక సాయుధ దళాలలోకి సమీకరించుకున్నారు. నా కుమారుడు రహీమ్‌ను వారికి అప్పగించాల్సి వచ్చింది. అతడికి పెషావర్ సమీపాన గల బజార్ - బాబా శిబిరంలో శిక్షణ ఇచ్చారు. అఫ్ఘానిస్తాన్‌లోకి దొంగచాటుగా ప్రవేశించి అఫ్ఘాన్, సోవియట్ సైనిక దళాల ఉనికి గురించిన సమాచారం సేకరించుకుని వచ్చే పనిని అతనికి అప్పగించారు. తూర్పు, కేంద్ర రాష్ట్రాలలో విధ్వంసక చర్యలు జరుపుతున్న విప్లవ ప్రతిఘాతుక దళాల వద్దకు సైనిక శిక్షకులను తీసుకు పోవడం కూడా అతని పని. అతడా పనిని అనేకసార్లు చేశాడు. ఒకసారి వెళ్లినవాడు తిరిగి శిబిరానికి చేరలేదు. అఫ్ఘాన్ సైనిక దళంతో జరిగిన ఘర్షణలో చనిపోయాడని తెలిసింది. మా కుమారుడు చనిపోయాక శరణార్థి శిబిరంలో మా పరిస్థితి మరింత హీనమై పోయింది. ఇంతకు ముందువలె మాకు డబ్బు ముట్టజెప్పడం ఆగిపోయింది. పొట్ట గడవడం కూడా గగనమైపోయింది. అంతర్జాతీయ సంస్థల సహాయం కూడా హుళక్కి అని రుజువైంది. మా పిల్లలు తరచూ జబ్బుపడసాగారు. మా మూడేళ్ల అమ్మాయికి నడక, మాటలు కూడా సరిగా రాలేదు. అఫ్ఘాన్ ప్రభుత్వం యీ సంవత్సరారంభంలో జాతీయ పునరేకీకరణ కార్యక్రమాన్ని అమలు జరపనారంభించాక శిబిరంలో మా జీవితం మరింత దుర్భరమవ సాగింది. తనిఖీలు, అరెస్టులు నిత్యకృత్యమయ్యాయి. అరెస్టు అయినవారు తిరిగి కన్పించేవారు కాదు. అఫ్ఘానిస్తాన్‌కు తిరిగిపోయిన వారందరనీ ఖైదు చేస్తారు. చంపివేస్తారని పెద్ద యెత్తున ప్రచారం చేయసాగారు. మా శిబిరంపై దాడిజరిగాక అఫ్ఘాన్ లందరిని పాకిస్తాన్ లోతట్టు భాగాలకు తరలించుకున్నారనే వదంతులు వ్యాపించాయి. కొద్ది రోజుల తర్వాత 200 మంది అఫ్ఘాన్ శరణార్థులను ఎక్కడికో తీసుకెళ్లారు. శరణార్థులను లోతట్టు భాగాలకు తరలించి, సైనిక శిబిరాలను మాత్రమే వాయువ్యసరిహద్దు ప్రాంతంలో వుంచుతారని నాకు అర్థమయింది. ఏ సింధు రాష్ట్రానికో తరలివెళ్లి, మాతృభూమి గురించి మరిచిపోవాలన్న ఆలోచనే నన్ను చలింప చేసింది. అందుకే టేర్రి - జంగల్ శిబిరాన్ని వదిలి వెళ్లాలని నిశ్చయించుకున్నాను. నంగర్‌హార్ రాష్ట్రంలోకి చల్లగా జారుకున్నాం. నేరుగా ప్రభుత్వ రిజిస్ట్రేషన్ ఆఫీసుకు వెళ్లి, అక్కడినుండి కాబుల్ వచ్చాను. నన్నెవరు ఏమీ అనలేదు. అధికారులు నన్ను మర్యాదగా చూశారు. నా భూమిని నాకు తిరిగి అప్పగించారు. ఇప్పుడు నా స్వగ్రామానికి తిరిగి వెడుతున్నాను. మా యింటిని మేము త్వరలో పునర్నిర్మించుకుంటాం. ఇబ్బందుల్లో వున్నవారికి తోడ్పడే సమిష్టి బృందాలు 'హెషార్లు' మాకు చేయూత

నిస్తాయి. మా దేశంలో రక్తపాతానికి చరమాంకం సలక నున్న జాతీయ పునరేకీకరణ క్రమం ఆఫ్ఘాన్ అందరికీ 'హెూషార్' గా వుపయోగిస్తుందన డంలో సందియం లేద" ని మహ మ్మద్ తహీర్ అన్నారు.

## కన్యాకుమారిలో

ఐదేళ్ల పసితనంలోనే ఎడమ చేయిని లాగేసుకుంది విధి. ఆ పేద కుటుంబంలోని పసివాడు.... తన వాళ్లందరికీ బరువయ్యాడు అయితే.... ఎక్కడో అతని పసి మనసులోని జిగీష - తృష్ణ - అతణ్ణి ముందుకు తీసుకెళ్లి 1987 వ సంవత్సరపు జాతీయ వికలాంగులకిచ్చే అవార్డుకు అర్హుణ్ణి చేశాయి. విధి చేతిని లాగేసు కున్నా అతనికి అంతర్గతంగా ఉన్న విద్యాకాంక్షని మాత్రం రెట్టింపు చేసింది అతని వైకల్యం. ఎప్పటికైనా డిగ్రీ సంపాదించాలన్న అతని వాంఛ అతని 21 వ ఏట నెరవేరింది--- ఓపక్క చదువు నేరుస్తూనే వడ్రంగం కూడా నేర్చుకోడం మొదలెట్టాడు - తోటివాళ్లని పరిశీలిస్తూ నేర్చుకొని అలా అలా పరిశ్రమిస్తూ ఏవో సృష్టిస్తూ చిన్న చిన్న మొత్తాలు సంపాదించుకోడం కూడా మొద లెట్టాడు. అలా గ్రాడ్యుయేషన్ నాటికే వడ్రంగం ద్వారా సంపా దనలో పడ్డాడు థాను. వడ్రంగం పని తో పాటు అతనిలోని కళాత్మక దృష్టి నైపుణ్యం ముప్పిరిగొని అతడికి మరింత పేరు తెచ్చాయి. కాల క్షేపంగా బొమ్మ గీయడం ప్రారం భించాడు. ఇటు కళానక్తి అటు సృజ నాత్మక శక్తి రెండూ కలిసి అతనికి ఆటబొమ్మలు తయారు వేయడంలో తోడ్పడ్డాయి. ఈ వడ్రంగం నేర్చుకుం టూనే ఒంటి చేత్తో పనిచేసే విధా నాన్ని సాధన చేశాడు. అప్పుడప్పుడు అవసరమైతే తన రెండో చేతికిబదులు తన కాళ్లని వినియోగించడం సాధన చేశాడు. దీని మూలాన 'థాను' కి ఓర్పు ఓపికా- సాధన అలవడ్డాయి. అందుమూలాన అతడెప్పుడూ సోమ రిగా ఉండటానికి అలవాటు పడలేదు. ఆత్మవిశ్వాసంతో కష్టపడి పనిచేస్తే ప్రతిఫలం తప్పక లభిస్తుందన్న విషయం అతడు తయారుచేసిన ఆట బొమ్మలని - వాటి అమ్మకాలనీ చూస్తే అర్థమవుతుంది--- "నేనెప్పుడూ డబ్బు గురించి పట్టించుకోను. విక లాంగుడిగా నేను విజయవంతంగా పనిచేస్తూంటే ఇప్పుడు ప్రజలు ఎలా ఆశ్చర్యపోతారో చూస్తూ ఆనం దిస్తాను." అతని ఆ భావనే కన్యా కుమారి నుంచీ వెలిగే కీర్తి నక్షత్రంలా అతణ్ణి ప్రకాశింపజేసింది - ఏ విక లాంగుడూ, నిరాశతో కుంగిపోకుండా బ్రతుకుని సాగించాలనుకున్నప్పుడు అతనికి డి. థాను జీవితమే ఒక సందేశం.



# చందూ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్ మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరీ వెర్జిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవజైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
వెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

సీరియల్

# భ్రమర గీత

## అచ్యుతవల్లి

గడచిన కథ: రామజోగి పంతులు ప్రాపకంతో ఎమ్. ఎ. ఎల్. ఎల్. బి. చదువుతున్నాడు చలపతిరావు - అదే పట్నంలో ఆయన మనుమరాలు భ్రమర ఏదో ఉద్యోగం చేస్తున్నది. శెలవలకి తమ ఊరువెళ్తూ భ్రమరని ఒకసారి కలుసుకు వెళ్దామని నానాశ్రమ పడి, చివరికి కలుసుకుంటాడు చలపతి రావు. భ్రమర అతనిని తను అద్దెకుంటున్న ఇంటికి తీసుకు వస్తుంది. భోజనాలయ్యాక.... ఇక చదవండి.

వంటినిండా చందనపు పౌడరు స్ప్రే చేసుకుంది. నెమ్మదిగా అంటీ అంటనట్లుగా మంచం మీద నడుం వాల్చింది. లేతాకు పచ్చ రంగు వాయిల్ నైటీలో వదులు వదులుగా శరీరం విశ్రాంతి తీసుకుంది. అలసిన శరీరం విపరీతమయిన సుఖానికి మైమరచి పోయింది. చలపతి నిద్రలో వత్తిగిల్లాడు. మెత్తని గుండెల మీద అతని చేయి పడింది. శరీరం అంతా అవిర్లు వచ్చేసి చలపతికి మెలుకువ వచ్చింది. కళ్ళు నులుముకుని మళ్ళీ చూసాడు. లేత నీల రంగు డిస్టంపర్ గోడల మీద నీలి రంగు బెడ్‌రూం లైట్, లేత చంద్రుని కాంతిలా మెత్తగా వుంది. తలగడ దిండునంతా భ్రమర మెత్తని జుత్తు పరుచుకుంది. ఆమె కళ్ళు కలువరేకుల్లా అరమోడ్చి వున్నాయి: గుండెలు ఆమె వూర్పులకి నెమ్మదిగా ఎత్తు అవుతుంటె చిత్రంగా చూసాడు. చలపతి నెమ్మదిగా ఆమె గుండెల మీద తగిలి తగలనట్లుగా చేయివేసి నిమిరాడు. భ్రమర పెదాలు నవ్వాయి. అలవోకగా వత్తిగిల్లింది. యుడికిలోన్ పరిమళాలు అతనిని ఊపిరి సలపనియ్యలేదు. ఇక కొంచెం దగ్గరకి జరిగేంతలో భ్రమర చేతులు అతనిని గట్టిగా పెనవేసి గుండెలకి హత్తుకున్నాయి. ఆ ఫోమ్ బెడ్ మీద అలసటతో ఏం చేసాడో కూడా గుర్తు లేకుండా గాఢ నిద్రలోకి కూరుకు పోయాడు. ఒక్క రోజులో వెళ్ళిపోతా నన్నవాడు, వారం రోజులు భ్రమరతో వుండిపోయాడు. రోజూ భ్రమరతో కబుర్లు చెప్పుకోవడం, షికార్లు కొట్టడం, ఇంట్లో తినీతినకుండా కాలం గడపటం - అల్లా చక చక గడిచి పోతున్నాయి రోజులు. చలపతికి ఇంటికి వెళ్ళడం ఇష్టంగా లేదిప్పుడు!

"తాతయ్య గారు జాబు వ్రాయింవారు" అంది.

"ఏమిటి విషయం?"

"నా కెంత డబ్బు కావాలన్నా అంత ఇస్తారట బుద్ధిగా ఇంటికి వచ్చేయ మన్నారు!"

"అల్లా చేయకూడదా మరి?"

"అక్కడేం వుంది నేనేం చేయను?"

"చదువుకో"

"ఎన్నాళ్ళు చదువుకుంటాను చిన్నప్పట్నించీ చదువుకుంటూనే ఉన్నాను."

"ఇష్టం లేకపోతే మానేసి హాయిగా ఇంట్లో కూర్చో."

"ఎన్ని రోజులు కూర్చుంటాను ఊరికనే"

"సుమన పెళ్ళయ్యే దాకా మీ అమ్మగారు చెప్పినట్లుగా విను, భ్రమర మంచి పిల్ల అనిపించుకో"

"ఆ తర్వాత?"

"నువ్వు పెళ్ళి చేసుకో"

"పెళ్ళా? అంటే ఏం చేస్తారు?" అంది కొంటెగా.

"మొన్న శ్రీపతికి, సుగుణకి చేయలా అదే పెళ్ళి అంటే!" కోపంగా కచ్చగా అన్నాడు తెలిసి కావాలనీ వాగుతోంది, అని అనుకొన్నాడు.

"వాళ్ళిద్దర్ని ఏమి చేస్తారు?" అంది పెంకిగా.

"ఏం చేస్తారు - వాళ్ళేమన్నా చిన్న పిల్లలా ఏమన్నా చేయటానికి చెట్లల్లే వున్నారు"

"మరే, అల్లాగే నేనూ చెట్టులా వున్నాను. ఎవరు ఏమి చేస్తారు?"

"అబ్బబ్బ నీతో వేగలేను బాబు!"

"నిన్ను వేగమన్నానా - ఉడక మన్నానా? నా ఖర్మన నన్ను వదిలెయ్యండి - నేను కేవలం డబ్బు కోసరం ఇల్లు వదిలి వచ్చేసానా? నాకక్కర లేదు, అనుకోకు. కాని నా పొట్టకు నేను సంపాదించుకుంటేనే నాకు తృప్తి. నా జీవితం నా ఇష్టం వచ్చినట్లు నడుపుకుందుకు, నాకు హక్కు వుంది. నా జీవితం ఒకళ్ళ శాసనంకు లోబడదు"

"శాసనం అనుకోకు. అది ఒక బాధ్యత. కన్నపిల్లలందరికి సరయిన జీవిత మార్గం చూపెట్టడం కన్న తల్లి దండ్రులకర్తవ్యం నీవు ఏదయినా అపమార్గం పట్టేవంటే నీకంటే తల్లి తండ్రులు ఎక్కువ బాధపడతారు."

"అబ్బో చాలా పెద్దవాడివయి పోయావే! నువ్వేమీ నాకు నీతి శతకం బోధించనక్కర లేదు. నన్ను గురించి ఎవ్వరూ బాధ పడనక్కర లేదు. అస్సలు నేను ఎవరో ఏమిటో తెలిస్తేగా! నన్ను గురించి బాధపడటానికయినా?" అంది భ్రమర. బిట్టర్‌గా అన్నట్లు అన్పించింది చలపతికి.

వూరికి వచ్చినాక రెండు మూడు సార్లు జోగిపంతులు గారి మేడలోకి వెళ్ళాడు చలపతి. అయిదు నిమషాల ఎక్కువ కూర్చోలేక పోయేవాడు. చనువుగానే పలకరించేది.

"కూర్చున్నట్లే కూర్చుని వెళ్తాను పనుంది!" అంటూ లేచి వస్తుంటే.

"నీకు భ్రమర లేకపోతే తోచదులా గుంది" అంది సుగుణ.

"అచ్చే అదేం లేదు!" నసిగేసాడు.

"మరెందుచేత అస్సలు కూర్చోలేక పోతున్నావు!"

"పనుందని చెప్పానుగా !"

"రోడ్లు సర్వే చేయటమేనా పని అంటె !" నవ్వేసాడు చలపతి.

ఒక రోజు మేరిలిన్ తాపీగా కూర్చుంది.

"చూడు చలపతి ! సుమనకి కూడా చూడు!" అంది.

"నా కేం తెలుసునండీ ! మా నాన్న గారిని అడగక పోయారా!"

"చెప్పాను! తనూ చూస్తానన్నారు!"

"పోనీ అందాక ఏదయినా జాబ్‌కి ట్రయి చేయకూడదా !"

"నాకిష్టం లేదు. ఏదో సంసార పక్షంగా చదువుకున్నాను !"

"గ్రాడ్యుయేషన్ సంసార పక్షం చదువా !"

"మామూలు క్లర్క్ జాబుకన్నా పెద్ద డిగ్నిఫైడ్ జాబ్ రాదు ఆ చదువుకి"

"పోస్టు గ్రాడ్యుయేట్ అవలేక పోయారా ?"

"నాకింకా చదువుకోవాలనిపించ లేదు !"

"విచిత్రం అంతా ఇక్కడ్నే వుంది" అన్నాడు చలపతి.

"అంటే ?"

"నాకు చిన్నప్పట్నించీ చదువు అంటే అమిత ఇష్టం. కాని ఎప్పుడు మానేయవలసి వస్తుందో నాకే తెలి యదు. అంత దిగులుగా వుండేది. మీకు చదువుకోవాలంటే ఎంత చదు వయినా చెప్పించగలరు. కాని మీకు ఇంటరెస్టు లేదు."



'మెట్రో' పంపిణీ చేస్తున్న 'ది - విండ్' (ఈదురుగాలి) ఆంగ్లచిత్రంలోని 'ఫిల్'

"అందుకనే మీకు తాతగారు చదువు మానేయవద్దని చెప్పారు."

"చెప్పారనుకోండి ! కాని నాకే సంకోచంగా వుంటుంది. చదువు చదువు అంటూ ఎన్నాళ్ళు పరాయివాళ్ళ ఆదరణ కోసం అర్రులు చాస్తాం !" అన్నాడు.

"చాల్లే ఊరుకో, తాతగారు వింటే బాధపడతారు. చిన్నప్పట్నించీ మా కుటుంబంతో కలిసి వుంటున్నారు. నిన్ను పరాయివాడిగా తాతగారు భావించారా ? పరాయి అన్న భావనే వుంటే నీ చదువు సంగతి పట్టించుకునే వారు కాదు" అంది మేరిలిన్.

"నువ్వు మా కుటుంబంలోని వాడివే అనుకోవాలి, అల్లాంటి సంకోచం

పెట్టుకుంటే ఋణ భారంతో మనసు కృంగిపోతుంది. దానితో చదువు మీద అసక్తి తగ్గిపోతుంది" అంది సుమన. తల్లీ కూతుళ్ళ వాత్సల్యానికి కరిగిపోయాడు చలపతి.

"ఎల్లాగో సుగుణ పెళ్ళి జరిగింది. సుమనకూ్కడా నీ స్నేహితుల్లో ఎవర యినా మంచివాళ్ళుంటే అలోచించు !" అంది మేరిలిన్. చామన చాయతో పొట్టిగా వుంటుంది సుమన. చెంపల్లో నునుపు మెరుపు వుంది. నల్లని వత్తయిన జుట్టు ! కుదురుగా వుంటుంది సుమన.

"దీనికి వంటావార్పు బాగా ఇష్టం చలపతీ ! చక్కగా పెళ్ళి చేసుకోవటం, భర్తకు పిల్లలకి అన్నీ అమర్చటం దీని కిష్టం !" సుమన పక పక నవ్వింది తల్లి చెబుతూంటే !

"ఎందుకు నవ్వుతావు?" అంది మేరిలిన్.

"చలపతి కొత్తవాడా అల్లా చెబుతావు ?" అంది.

"అది కాదు ఒక సంగతి నేను కని పెట్టాను, చలపతీ ! ఇక్కడి వాళ్ళకి డబ్బు అంటే అశవుంది. మళ్ళీ నీతి, జాతి, పరువు ప్రతిష్ట అంటూ ఏడు తరాలు ఎత్తిపోయటమూ వుంది !"

"మీరు చెప్పబోయేదీ...."

"పూర్తిగా చెప్పనీయి, చలపతీ ! ఈ పిల్లకు మామూలు తెలుగు పెళ్ళి చేయాలంటే చాలా కష్టపడవలసి వస్తుంది. ఇక్కడ వాళ్ళలో చదువు, అందం తల్లి తండ్రి వున్న ఆడపిల్లల పెళ్ళికే విశ్వప్రయత్నంచేయాలి." మరి మా అమ్మాయికి డబ్బు తప్ప మిగిలిన శుభలక్షణాలేవీ లేవనే చెప్పాలి."



'అదేమిటండీ ?''

"తండ్రి వదిలేసాడు. పైన బెంగాలీ ఆయన. ఆయన బ్రాహ్మనో, నాన్ బ్రాహ్మనో నాకే తెలియదు. నా తండ్రి అమెరికా ఆయన. నన్ను నా తండ్రి వదిలేసాడు, అంటే తల్లితండ్రులు వదిలివేయటం ఆచార మయిపోయిం దన్నమాట ! బెంగాలీ ఆచారం స్వీకరించి అక్కడివాళ్ళకే పిల్లనిచ్చి పెళ్ళి చేయాలంటే నన్నే వాళ్ళ కోడలిగా అంగీకరించలేదు. ఇంక ఈ పిల్లలని ఎవళ్ళు అంగీకరిస్తారు ? పిన్ని మామయ్యల దగ్గర వీళ్ళ వయసుకు తగు మగపిల్లలు లేరు. అంచేత తెలుగు కుటుంబాలలో అయినా కుదరవా అనే ఆశతో ఇక్కడికి వచ్చి చేరాము. తాతగారు మూడు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తి ఇచ్చారు. ఈ ఆస్తితో వీళ్ళ జాతి సంకరతని మార్చగలనా ? వీళ్ళ బుద్ధికి సంకరత లేనే లేదు మరి ! వీళ్ళకి తెలియని జాతి వీళ్ళ భవిషత్తుని శాసించుతున్నదా ?'' మేరిలిన్ కళ్ళలో తడి కన్పించింది.

"ఏదో వక ఉద్యోగంలో చేర్చండి. నలుగురిలో కలిసి మెలిసి తిరిగితే ఎవరికో ఒకరికి నచ్చుతారు'' అన్నాడు చలపతి.

"పెళ్ళి కావాలంటే ఉద్యోగం కూడా ఒక సాధనం అన్నమాట'' అంది సుమన.

"అదే లక్ష్యం కాకపోయినా నలుగురితో పరిచయం వల్ల మీ మనస్సేమిటో ఇతరులకి తెలిసే అవకాశం వుంది. విశాలం అవుతుంది'' అన్నాడు చలపతి.

"సుగుణ పెళ్ళి అయినాక బంధువులు వస్తున్నార్లెండి ! కొంచెం కొంచెం ఇప్పుడిప్పుడే ఇరుగు పొరుగు వారు వస్తూపోతూ పరిచయం పెంచుకుందుకు ఉత్సాహం చూపుతున్నారులే'' అంది మేరిలిన్.

చలపతి ఇంటికి వెళ్ళాడు. లక్ష్మణరావు ఇంట్లోనే వున్నాడు.

"ఈ సంవత్సరం వసుధకి పెళ్ళి చేసేద్దామురా'' అన్నాడు లక్ష్మణరావు. వసుధ ఫోర్ ఫారం చదువు



ప్రపంచ వ్యాప్తంగా ఆడపిల్లలకు 'స్కిప్పింగ్' అంటే సరదా. అయితే నిముషానికి ఎన్నిసార్లు గెంతగలరో ఎప్పుడైనా లెఖ్ఖచూశారా ? సర్వసామాన్యంగా 80 నుంచి 90 సార్లు నిముషానికి.

తున్నది. పదమూడు సంవత్సరాలు నిండుతున్నాయి.

"సరే చేసెయ్యండి. సంబంధం చూసారా ?"

"మీ మామయ్యకి వ్రాసామురా ! ఏవో రెండు మూడు సంబంధాలున్నట్లు చెప్పాడుట ! మనకి అందుబాటులో ఏది వుంటే అది సెటిల్ చేద్దామనుకుంటున్నాను."

"అల్లాగే చెయ్యండి," అన్నాడు.

"కట్నం, ఖర్చులకి సొమ్ము జత చేసుకోవాలి. సొమ్ములేకుండా పెళ్ళి సంబంధాలకి ఎగబడటం బావుండదు కదా."

"అయితే ఇప్పట్నించే తొందరపడి పోకండి నాకెక్కడో ఏదో ఉద్యోగం వచ్చి సెటిల్ అయితే అప్పుడు కొంచెం చదువూ సంధ్యా వున్నవాడికిచ్చి చేయవచ్చును" అన్నాడు చలపతి.

"ఇప్పుడయినా మరీ నాసిరకం సంబంధం కాదులేరా ఒక అబ్బాయి ఇంటర్ చదివాడట. పెద్ద మెడికల్ స్టోర్‌లో గుమాస్తాగా వున్నాడట ! ఇల్లూ రెండు ఎకరాల పొలం వున్నాయిట, అతనికి. ఆరువేల కట్నం కావాలిట. ఇంకొకతను బి.ఎ.బి. ఇడి ప్యాస్ అయాడుట. నలుగురు అన్నదమ్ములు, ఆరుగురు అక్కచెల్లెళ్ళు వున్నారు. కట్నం తీసుకోరుట కానీ...."

"మరేం కావాలిట ?"

"అతని చెల్లెళ్ళలో ఏదో వక అమ్మాయిని నువ్వు పెళ్ళి చేసుకోవాలిట."

"కుండ మార్పిడి పెళ్ళి మనలో లేదు కదా, నాన్నా."

"అంటే నీకు నచ్చిన అమ్మాయిని వాళ్ళ పినతల్లికి దత్తు ఇస్తారుట. కన్యధార వాళ్ళే పోస్తారుట. అందుచేత కుండమార్పిడి అవదుట ! ఆ ఉపాయం వాళ్ళే చెప్పారు."

"అప్పుడే ఏం తొందరలలెండి ? ఏదో మంచి ఉద్యోగం చూసుకోవాలి - జీతం అంతా ఒక సంవత్సరంపాటు నిల్వ వుంచాలి. అప్పుడు పెళ్ళి గురించి ఆలోచించాలి. ఇప్పట్నించే పెళ్ళి రాయబారాలు వద్దు" అన్నాడు చలపతి.

"లా చదువుతున్నావు. లాయరుగా ప్రాక్టీసు చెయ్యవా !"

"పెద్ద పెద్ద లాయర్ల కొడుకులే ఉద్యోగాల్లో చేరుతున్నారు. ఇంకా నాలాంటివాడు లాయర్‌గా ఏం సంపాదిస్తాడు ? ఏదో కంపెనీలో ఉద్యోగానికి ట్రై చేయాలి !" అన్నాడు చలపతి.

"ఏదో చెయ్యి" నేను చాలా మందితో చెబుతున్నానులే ! ఈ వూళ్లో గంగాధరుగారు లీడింగ్ లాయర్. ఆయన వద్ద కొన్ని రోజులు అప్రెంటిస్‌గా చేయవచ్చును. ఆయన ఒప్పుకున్నారు కూడాను."

"వద్దులెండి నేను ఆ ప్రొఫెషన్‌లోకి వెళ్ళదలుచుకోలేదు" అన్నాడు చలపతి.

లక్ష్మణరావు ఎత్తుగడ వేరు. రంగనాధంకు చాలా ఆస్తి, ఆడపిల్లలూ వున్నారు. గంగాధరంగారికి పిల్లలు లేరు. తన కొడుకు లాయర్‌గా పేరు తెచ్చుకుంటే గంగాధరంగారి

తమ్ముడైన రంగనాధంకు నచ్చచెప్పి ఒక పిల్లని ఇచ్చి పెళ్ళి చేస్తారు, చల పతిని వృత్తిలో పైకి తీసుకుని వస్తాడు అని ఆశపడ్డాడు.

"భ్రమర అమ్మగారు నీతో చెప్పా రుట కదా" అన్నాడు చలపతి.

"ఏమిటి ?"

వాళ్ళ సుమనకి సంబంధం చూడమని"

"అందర్నీ వాకబు చేస్తున్నాను. తండ్రి తాతలు మన జాతి కాదనే సరికి వెనుకడుగు వేస్తున్నారు. బోలెడు ఆస్తి వుందని చెప్పినా ముందుకు రావటం లేదు ! ఎంతమంది తోటో చెబుతున్నాను."

"పిల్లలు సరళ స్వభావులు కదా ! వాళ్ళల్లో విదేశీపోకడ లేమయినా వున్నాయా ! మన తెలుగు ఆడపిల్లల కన్నా చాలా నిదానంగా వుంటారు".

"ప్చ ఇల్లాంటి పిల్లలకి తమ భర్త లని తాము వెదుక్కునే చాకచక్యం వుండాలి. లేకపోతే గంపెడు బంధువు లన్నా వుండాలి. రామజోగి పంతు లుకి ఇరసా పరస్తా ఎవ్వరూ లేరు. దూరపు బంధువులు కూడా తమకి సద్వంశం కావాలి అంటున్నారు !" అంది అనసూయ.

"అంతేలే నిజంగా సద్వంశంతో పుట్టిన ఆడపిల్లలు అత్తవారిళ్ళల్లో పనులు చేస్తున్నారా భర్తని చంకల్లో పెట్టుకుని వేరే వెళ్ళిపోతుంటే వృద్ధా ప్యంలో తల్లి తండ్రులు ఎన్ని ఇబ్బం దులు పడతారు ? నీతి జాతి అంటారు. ఒక జాతికి నీతి అంటూ వుంటుంది.



మ్యూజిక్ అకాడమీలో తన నాట్య కౌశలంతో ప్రేక్షకులను మెప్పించిన సినీతార అర్చనా

ఒక నియమము అంటూ వుంటుంది. ఒక జాతి నియమము ఇంకొక జాతి అనుసరిస్తే తప్పేమిటి ? మనం ఎన్ని జాతులు మారామో ఎవరికి తెలుసును ? ఒక ఉపాధి కోసరం ఒక చోటినుంచి ఒక చోటికి మారుతూ అక్కడ స్థాని కులతో వివాహ సంబంధాలు కలుపు కుంటూ వచ్చిన వాళ్ళం కామా ? వీళ్ళయితే కళ్ళముందరి వాళ్ళు కనుక సంకరజాతి అంటున్నాము. మనకి కొన్ని తరాలు గడిచిపోయాయి కనుక ఎవరికీ తెలియదు. మనదొక జాతి పవిత్రమయినది అనుకుంటున్నాం" అన్నాడు లక్ష్మణరావు. తండ్రి అభి ప్రాయానికి మనసులోనే అభినందిం చాడు చలపతి. తండ్రి పరంగా మేరిలిన్ కుటుంబంతో సంబంధం

పెంపొందింప చేసుకోవటానికి ఏమీ అభ్యంతరం లేదని స్థిర నిశ్చయం చేసుకున్నాడు. అయినా పైకి తన అభిలాషని నలుగురితో వెల్లడి చేయ కూడదు. నలుగురు నాలుగు రకాల మాటలు అనటానికి దోహదమవు తుంది. పైకి ఈ మాట రాకూడదు. అనుకున్నాడు చలపతి. మర్నాడు చలపతికి ఫస్టుక్లాసు వచ్చినట్లు ఫ్రెండు జాబు వ్రాసాడు మర్నాడు.

"ఏమిటి నువ్వక్కడే పాతుకు పొయ్యావ్ ఇక్కడుంటే ఏదయినా జాబ్‌కి ట్రై చేయువచ్చును - అక్కడ కూర్చుంటె నీ కోసరం టెలిగ్రాఫిక్ ఆర్డర్స్ పంపించేవాళ్ళెవరూ వుండరు!" నీ భ్రమర అంటూ లెటర్ వ్రాసింది. కొడుకు ప్రయాణం అవుతూండటం చూసాడు లక్ష్మణరావు.

"అక్కడి కెందుకు, మార్కులు అవీ పోస్టులో పంపరా!" అన్నాడు.

"మిస్సయితే ట్రైంకు అందవు. ఒక సారి వెళ్ళి అవసరమయిన సర్టిఫికేట్స్ అన్నితెచ్చుకుంటాను. ఉద్యోగాలేమైనా వుంటే ట్రయి వేయటానికి కాపీలు తీయించాలి గదా?"

"సరే" అన్నాడు. కొడుకు పెద్ద వాడయినాడు. తనకంటేఎన్నోరెట్లుమాన సిక వికాసం పెంపొందించేందుకు చదువు కున్నాడు. వాడి గురించి తనేమి బెంగ పడక్కరలేదంటె అనుకున్నాడు లక్ష్మణ రావు. వెళ్ళేప్పుడు చెప్పటానికి వెళ్ళాడు చలపతి. "భ్రమర అక్కడ్నే వుండి పోతుందా? అంది మేరిలిన్ కాఫీ ఇచ్చి.

"ఏమోనండి" అన్నాడు చలపతి.

"ఇక్కడికి వచ్చేయమని చెప్పు ఎమయింది దానికి? తల్లిని అక్కచెల్లె ళ్ళనీ వదిలి అక్కడ అంత దూరంలో ఒంటరిగా ఏం చేస్తుంది?" అంది మేరిలిన్.

"ఆమె జీవితం ఆమెదిట" అన్నాడు చలపతి.

"అవునయ్యా ఎవరి జీవితం వాళ్ళదే. కొంచెం అయినా ప్రేమ. సాను భూతి వుండాలా వద్దా? సరదాగా అక్కడి విశేషాలన్నీ వ్రాయవచ్చును కదా తల్లిని ఒకదానిని వున్నమాటే మర్చిపోయింది తను."

"మాకెందుకు వ్రాస్తుంది? మావి మునలమ్మ భావాలుట గుడిలో లింగం గా కూర్చుంటామట! ఇక్కడి అమ్మా యిలని చూస్తే మాకెంతో సరదాగా వుంటుంది. అయిదారుగురు అమ్మా యిలు వున్నారంటే వాళ్ళకి ఇంక ఫ్రెండ్స్‌తో పనేముంటుంది? హాయిగా వాళ్ళల్లో వాళ్ళేకబుర్లు చెప్పుకుంటారు. ఒకళ్ళకి ఒకళ్ళు ఫాషన్స్ మప్పు కుంటారు. ఒకళ్ళ చీరలు ఒకళ్ళు మార్చుకుంటారు. బలే సరదగా గడిచి పోతాయి" అంది సుమన.



ఈ మధ్యనే సోవియట్ యూని యన్‌లో పర్యటించి వచ్చిన ఆర్టిస్ట్ ఈశ్వర్

"ఆ అదృష్టం మనకి లేదు. వుం టానికి మీరు అయిదుగురు వున్నారు: అందరిదీ తలొక దారీ! అసలు నా పెం పకంలో వచ్చిన లోపం ఇది. అను కుంటూ వుంటాను" అంది మేరిలిన్.

"పోనీ శీలా మాలలనైనా ఇక్క డికి రమ్మనలేక పోయారా?" అన్నాడు. చలపతి.

"మా పిన్ని పంపటం లేదు. చదు వుల్లో మంచి శ్రద్ధ కనపరుస్తున్నారుట వాళ్ళకి మంచి హైయర్ స్టడీస్ చెప్పిం చాలని మా పిన్ని అంటుంది."

"సుగుణ అత్తవారింటికి వెళ్ళి పోయాక కూడ లోన్లీగాఫీలవుతున్నట్లు న్నారు. ఏదయినా జాబ్ చెయ్యండి కొన్నాళ్ళు" అన్నాడు చలపతి.

"వీలయినంత త్వరలో భ్రమరని వచ్చేయమని చెప్పు - తనకెలాంటి ఫెసిలిటీస్ కావాలంటె అల్లాంటి ఫెసిలిటీస్ చేస్తానని చెప్పు," అంది మేరిలిన్.

"ఎందుకమ్మా దాన్ని రమ్మనటం - అది స్వేచ్ఛ కోరుకుంటోంది" అంది సుమన.

"దానికి రెక్కలు కత్తిరించేసానా? ఏటొచ్చీ బలాదూర్లు తిరగొద్దు అన్నాను. స్థిరంగా ఒక జీవితం ఎన్ను కోమన్నాను."

"అది వాసవ్‌ని మర్చిపోవటానికి అంత దూరం వెళ్ళిపోయింది" అంది సుమన.

"వాసవ్ ఎవరు?"

"ఎవరో మార్వాడీల అబ్బాయిట - సంగీతం నేర్చుకుందుకు వచ్చేవాడుట. ఇద్దరూ పెళ్ళి చేసుకుందామనుకున్నారేమో - చివరికి అతను పెళ్ళి పేరు చెప్పగానే పలాయనం చిత్తగించాడుట!" అంది సుమన.

"వస్తానండీ" అంటూ లేచాడు చలపతి.

"అమ్మా, నీకు తెలియదు. భ్రమరకి చలపతి అంటే ప్రేమ. ఇక్కడి తెలుగు వాళ్లు సంబంధాన్ని ఒప్పరు అని దాని భయం! అంచేత చలపతికి దగ్గరగా వుండాలనిఅది అక్కడమకాంపెట్టింది" అంది చలపతి వెళ్ళాక సుమన.

"ఒకళ్ళు ఒప్పేదేముంది? నేను అతనిని చేసుకుంటానంటే వెంటనే పెళ్ళి చేసెయ్యనా? తల్లిని నా వద్ద భయమూ, దాపరికమూ ఎందుకు?"

"అది చలపతికన్నా చాలా పెద్దది. నాలుగయిదేళ్ళు పెద్ద వయస్సు వుంటుంది. ఇక్కడివాళ్ళు పాతిక సంవత్సరాలు వున్న అబ్బాయికి పద్నాలుగేళ్ళ అమ్మాయి నిచ్చి పెళ్ళి చేస్తారు"

"మనకిష్ట మయితే సరి - ఒకళ్ళ ఇష్టంతో ఆలోచన చేయటం ఎందుకు?"

"లక్ష్మణరావుగారు అబ్జక్షన్ పెట్టుతారేమో?"

"ఆయనకిమన కుటుంబం చేసేసహాయం అంతా ఇంతా కాదు. ఆయన తాతగారి ప్రతిపాదనకి ఎదురు చెప్పలేరు."

"తాతగారు అంటే భ్రమరకు భయం. ఆయనకు చెప్పలేక పారిపోయింది" అంది సుమన. ❋ ❋

నేరుగా భ్రమర యింటికే వెళ్లాడు చలపతి. ఇంటిలోనే బుద్ధిగా కూచుంది భ్రమర.

"ఏమిటి సరాసరి నా దగ్గరకే వచ్చావా?" అంది భ్రమర.

హాస్టల్‌లో మా బాచ్ వాళ్ళెవరూ లేరు. అయినా నీ ఉత్తరం చూసుకునే నేను బయలుదేరాను."

"వసంత్ నారంగ్ ఇప్పుడు నా కేరాఫ్‌లోనే వున్నారు. తెలుసా!"

"నాకేం తెలుసు? నువ్వు లెటర్‌లో వ్రాయలేదు కదా!"

"వాళ్ళకేవో చిన్న చిన్న ఉద్యోగాలు దొరికాయి."

"ఎన్ని ఉద్యోగాలున్నా ఏమిటి?"

"ఒక ఉద్యోగం దొరుకుతుందనుకో అది చేస్తూవుంటె అంతకన్నా మంచిది ఇంకొకటి కాళ్ళకి తగులుతుంది. కాళ్ళకి వచ్చిన బేరం కాశీకి వెళ్ళినా తగలదు కదా! అందుకని అది వేయటం మొదలు పెట్టుతారు. ఇల్లాగ ఒకదాని తర్వాత ఇంకొకటి చేస్తూ వుంటారు. ఊరు వదిలి పోనవసరం లేకుండా మెయిన్‌టెయిన్ అయిపోతుంటారు."

"నిన్ను ప్రజా సేవ మానేసి ఇంటికి వచ్చేయమన్నారు"

"నేను ఇంటిలో కాక రోడ్డు మీద వుంటున్నానా?"

"మీ అమ్మగారి వద్ద వుంటే నీకేం లోటు?"

"అక్కడుండి ఏం చేయను-తోటలు దొడ్లు ఎన్ని రోజులు తిరగను?"

"కాలేజీలో చేరి చదువుకో!"

"ఆ భాగవతం అయిందిగా!"

"పోనీ నీ కిష్టమైన సంగీతం నేర్చుకో!"

"సంగీతం నాకు ఇష్టమయిందని కాదు."

"వాసవ్ లేడుగా - ఇంక ఇష్టము పోయివుంటుంది!"

"నాకు వాసవ్ ఇష్టమని ఎవరన్నారు, సుమనేనా!" చలపతి మాట్లాడ లేదు.

"ఇదిగో పతీ; అదేదో ఊహించు కుని నీతో ఏదో వాగి వుంటుంది. వాసవ్ అంటే నాకేమి ప్రేమ లేదు. మార్వాడీల అబ్బాయి. సితార్ ముందు కూర్చుంటే అందంగా అద్భుతంగా కన్పించేవాడు. చాలా సుకుమారంగా నీకంటేమృదువుగా వుండేవాడు. అతని

లోని కోమలత్వానికి ముగ్ధురాలనయి అతను సితార్ పలికించుతున్నంత సేపూ అల్లా చూస్తూ కూర్చునేదానిని. అతను సంగీతంలో బాగాతర్ఫీదు అయి నాడు. ఇంకా పెద్ద పెద్ద విద్వాంసులకు శుశ్రూష చేసి సంగీతంలో నిష్ణాతుడవ్వాలని వెళ్ళిపోయాడు. అంతకన్నా మా ఇద్దరి మధ్య ఎటువంటి సంబంధమూ లేదు !"

"నువ్వు అతని మీద విరహం భరించలేక ఇల్లు వదిలి వచ్చావని అనుకుంటున్నారు సుమన, మీ అమ్మగారూను !"

"నాకెవ్వరి మీదా విరహం లేదు. ఒక సరళ ప్రభావాన్ని, ఒక ప్రకృతి సిద్ధమయిన అందాన్ని క్షణంసేపు ఆనందించకలను. అంతేకాని వాళ్ళ మీద బెంగ పెట్టుకుని కృంగి కృశించిపోయి, నశించిపోవాలని నాకేమిలేదు. ఒక పువ్వుల తోటను చూస్తే, ఒక అందమయిన నీటి చెలమ చూస్తే, ఒక నిండా పండిన ఫలాలున్న కమలాల చెట్టును చూస్తే కలిగే సంతోషం, వాసన్ని సితార్ పట్టుకోగా చూస్తే కలిగేది. ఆ సంతోషం కోసం అల్లా కూర్చుండిపోయేదాన్ని !" అంది భ్రమర. నిస్సంకోచంగా మాట్లాడే భ్రమర మాటలను ఎప్పుడూ నమ్మకుండా వుండడు చలపతి.

"నీ అంతరంగ భావాలెవరికి తెలుస్తాయి భ్రమరా ! అతనేదో నిన్ను పెళ్ళి చేసుకుంటానని నమ్మించి మోసగించి పోయివుంటాడని మీవాళ్ళే అనుకుంటున్నారు !"

"నన్నెవరు మోసం చేస్తారు ? మోసగింపబడటంలోనే వుందా ? స్త్రీకి వుండవలసిన లక్షణం ! ఒకరిచేత మోసగించబడి, జీవితం అంతా కుళ్ళి కుళ్ళి ఏడవాల్సినవాళ్ళు స్త్రీలేనా ?"

"కాకపోతే ఆ ఊరు ముఖం చూడలేనంత బాధ నీకేమి వచ్చిందిప్పుడు ? ఎందుకింత దూరంలో మకాం వుండటం ?"

"నా అంతట నేను బ్రతకగలనా లేదా అని చూస్తున్నాను. నీవే తప్ప ఇతఃపరం బెరుగ, అన్నట్లుండాలి తెలుగు దేశంలో మగాళ్ళకి ! కాస్త స్వేచ్ఛ కోరే స్త్రీని వాళ్ళు భరాయించలేరు."

"నువ్వెంత మందిని చూసావేమిటి ? మొత్తం తెలుగుదేశంలోని మగాళ్ళనందర్నీ ఒకే దారంకుదండ గుచ్చేస్తున్నావు !"

"నన్నడిగితే ఒక్క తెలుగుదేశం మగాళ్ళకే కాదు, ప్రపంచంలోని యావన్మంది మగాళ్ళకీ ఒకే రకం జబ్బు వుందనుకుంటున్నాను"

"ఏం జబ్బు ?"

"ఆడది కన్పించితే లొంగేదాక ప్రేమ పాఠాలు వల్లించటం. లొంగాక దోమలా తోలి పారెయ్యటం !"

"ఎవళ్ళో తలతిక్క వెధవలు అల్లా చేస్తారని అందర్నీ అల్లా తీసిపారెయ్యకూడదు" అన్నాడు చలపతి.

"అంతా ముందు అల్లాగే అంటారు లేవయ్యా 'బాబూ !" అంది భ్రమర; వంటగదిలోకి దారి తీసింది.

(ఇంకా వుంది

సీరియల్

# 'ప్రతి గురువారం'

గడచిన కథ: మూటరెండు డిగ్రీల జ్వరంలో ఉండగా 'ఆర్కయివ్' పత్రిక కొంటాడు బాబ్. భార్యాభర్త లిద్దరికీ ఉత్సాహమే తప్ప పత్రికా ప్రచురణలోని సాధకబాధకాలు తెలియవు. ఆ డవునింగ్ టవున్‌లో అప్పటి కప్పుడే ఆరు పత్రికలకు గోరీ కట్టారట. ఈ పత్రిక అచ్చువేసేందుకు ప్రెస్సు వెతుక్కోవాలి.... ఇక చదవండి.

మా పత్రికకి పేపరుకొట్ల (న్యూస్ స్టాండ్స్) ద్వారావుండే అమ్మకం వారానికి 5 కాపీలు; మాకు వొప్పజెప్పిన 1750 మంది చందాదారుల పట్టికలోను 60 మంది తప్ప మిగతా వారు చనిపోయారు; 1946 మేలో మేము ఆ పత్రికకి - 71 సంవత్సరము వయసుగల ఆ పత్రికకి యజమానులు, ఎడిటర్లు, పబ్లిషర్లు, యడ్వర్టయిజ్‌మెంట్లు, మేనేజర్లు, రిపోర్టర్లు —ఆఫీసు కుర్రాళ్లు — ఒకటేమిటి, సర్వం మేమే అయాం. మా మొహానికి ఎలా బొప్పి కడుతుందో చూదామని ఊళ్లో వాళ్లందరూ కాసుకు కూచున్నారు.

మా డవునింగ్ టవున్‌లోని 5000 మంది ప్రజా, మిగతా అన్ని గ్రామాల్లో మనుష్లలాటివాళ్ళే! ఎలా వున్నది అలా వుండనీయమంటారు; మార్పు అంటే వాళ్ళకి మహా చెడ్డచిరాకు. మా మానాన మమ్మల్ని వుండనీయండి — అనేది వాళ్ళ ధోరణి అని గ్రామాధికారి (మేయరు) ఒకసారి అన్నాడు. తలుపులు వేసేసుకు, నాలుగుగోడల మధ్య వాళ్ళ బాధలు వాళ్లు అనుభవిస్తారుగాని, వీధిని పడటం యిష్టం వుండదు. తలుపులు మూసేసు కుంటారు. 'రండి, ముందుకి నడుద్దాం' అంటే — రారు.

కాని, మేము తలుపులు తెరిపించడం మొదలెట్టాం. మంచీ చెడూ, ఆశ నిరాశా, కష్టం సుఖం — యివి మానవులందరికీ అన్నిచోట్లా ఒకటే నని తెలుసుకున్నాం. పైకి జడులుగా కనిపించేవారి అంతర్యంలో సానుభూతి వుండవచ్చు. గ్రామ పాలక సంఘానికి డబ్బు వుండదు; నడివీధిలోని చిన్న గొయ్యి కొత్తకారు స్ప్రింగ్‌లను విరగ్గొడుతుంది. నలుగురుపిల్లల తల్లికి యిల్లూ వాకిలి లేకపోయేటప్పటికి ఊళ్లో వాళ్ళు తిండీ బట్టా యిచ్చి, జీవనోపాధి చూపిస్తారు. చిక్కుల్లోవున్న కుటుంబాలకి క్రిస్మస్ టైములో, చేతికి ఎముక లేనట్టుగా సహాయం చేస్తారు వర్తకులు.

ఇవేకాదు మేము తెలుసుకున్నది - ఇంకా చాలా వున్నాయి. ద్వేషాలూ దురభిప్రాయాలూ పోగొట్టాలి. పైకి కనుపించేదే నిజమనుకో కూడదు

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చినజాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |



20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



**క్వాలిటీ పబ్లిషర్స్**

**రామమందిరం వీధి – విజయవాడ-2**



విజ్ఞానశాస్త్రం శాఖోప శాఖలుగా విస్తరిల్లింది. తాము స్పెషలైజ్ చేసిన శాఖలోని నూతన పరిశోధనలూ వాటి ప్రభావాలు తెలుసుకునేందుకు విజ్ఞానవేత్తలకు తగినంత వ్యవధి వుండటం లేదు. ఈనాటి పరుగు అలాటిది.

మనిషి ముఖం ఒక్కొక్కప్పుడు అతని ప్రవర్తనని కప్పివుంచుతుంది కూడాను. అబద్ధాన్ని నిజమని నమ్మించబోతారు కొందరు. మానవస్వభావం గురించి మాకు ఓనమాలు కూడా తెలియవని - పత్రిక మొదలెట్టాక తెలుసుకున్నాం.

పత్రికని క్లుప్తంలో తేల్చేసేవాడు కాబట్టి, వెనుకటి యజమానికి ప్రతివారం నాలుగు డబ్బులు గిట్టేవి. యడ్వర్టైయిజ్‌మెంట్లమీద వచ్చిన డబ్బు తిన్నగా అతని జేబుల్లోకి వెళ్ళేది. ఏదో మసి పూసి మారేడుకాయ చేస్తూ, ప్రతివారం పత్రికని బయటపడేస్తూండేవాడు. ఈ పత్రికకిగాను అతను ఒక ప్రెస్‌ని, అద్దెకు తీసుకున్నాడు. అచ్చుపనులు సంపాయించి పెట్టేందుకు, ఈ పత్రిక ఉపయోగ పడుతూండేది. రెండు చేతులా సంపాయించి, ఒక మంచి రోజున చేతులు కడుక్కున్నాడు ఆ పాత యజమాని. ఇక మానెత్తికొచ్చి చుట్టుకుంది. మా పని ఎలా ఉందంటే, సర్క్యులేషన్ పెరిగినకొద్దీ ప్రొడక్షను ధరకూడా మరీ ఎక్కువవడం మొదలెట్టింది లాభానికి బదులు నష్టం కనిపించేది.

అందుకనే చిన్న పత్రికవారు అచ్చుపనులమీద ఆధారపడతారు. అచ్చుపనులు వారిని నిలబెడతాయి. పత్రిక సైడ్ బిజినెస్‌గా ఉంటుంది. ఇలాటి పత్రికలు నిజానికి పత్రికల్లా ఉండవు - పొట్లాలు కట్టుకునే కాయితాలా ఉంటాయి. పబ్లిషరుకీ లాభంగాని ప్రజలుకేమీ ప్రయోజనం లేదు. అటువంటి పత్రికకి నోరు వాయీ ఉంటుంది గనకనా ప్రజాభిప్రాయం చెప్పేందుకు? అసలు అటువంటి పత్రిక అందరికీ నవ్వుతాలుగా ఉంటుంది. రేపు ప్రచురణ తేది అనగా యివ్వాళ ఆలోచిస్తాడు ఆ పత్రిక ఎడిటర్. దానిగురించి, కట్టల్లోవి నాలుగు కాయితాలు తీసి, కంపోజ్ చేయించి, మొక్కుబడిలా ఆ నాలుగు పేజీలూ గుద్దించేస్తాడు. చివరికి, ఆ పత్రిక చేతులు తుడుచుకునేందుకు ఉపయోగ పడుతుంది.

నాకు అంతవరకూ అచ్చాఫీసు అంటేనూ, ప్రింటింగ్ అంటేనూ ఏమీ తెలియదు. పత్రికలనేవి పోస్టులో వస్తాయనేకాని, యింత గొడవ వీటికి వున్నదని అనుకోలేకపోయాను. జీవితంలో

కొత్తదనం, కొత్తపనీ అగుపడ్డాయి. నేను బాబ్ కలిసి వారానికి ఒక వంద చందాదారుల చొప్పున చేర్చగలం, టైప్ రైటర్లు ముందేసుకు కూచుని, ఈ డవునింగ్ టవున్‌ని కొత్తదానిగా మార్చేయ గలము. పైన ఎగిరే విమానం నేల మీదకి దిగింది. మేమూ మనుషుల్లో పడాం. "ఆర్కాయిప్" ప్రింట్ చేయించేందుకు ఏదైనా ప్రెస్ వెతకాలి.

## 5

న్యాయవాదులూ, రాజకీయవాదులూ ఎన్ని తరహాలుగా ఉంటారో, చిన్న పత్రికలవారు కూడా అంతే. వారిదొక ప్రత్యేక జాతి. వారి విజయం, వారు సాధించిన కార్యాలలోను, వారు చేసిన అప్పులలోనూ కనపడుతుంది - అంతేగాని వారి ఆస్తుల్లోనూ నిలవల్లోనూ కాదు.

చిన్న పత్రిక ఎడిటర్‌కి (Country Editor) తనవారి సమస్యలపట్ల నిజమైన సానుభూతి వుండాలి. దయాంతఃకరణతో అందరి పట్లా అనురాగం చూపించగలగాలి. ద్వేషపూరితంకాని అనక్తితో అన్ని విషయాలూ ఆకళింపు చేసుకోవాలి. పెద్ద పత్రిక ఎడిటర్‌కి ఈ యిబ్బందులేమీ లేవు. సంపాదకవరం అతనిని కాపాడుతూంటుంది. చిన్న పత్రిక ఎడిటర్ తన చందాదారులకి సంజాయిషీ చెప్పుకోవలసినవాడు. గ్రామ వైద్యుడూ, గ్రామ ఉద్యోగులు లాగానే యితను వారికి నిత్యం కనిపిస్తూంటాడు. ఇతనికి పరాయివాళ్ళంటూ లేరు; అందరూ తనవాళ్ళే, కొందరితో పరిచయం వుంటుంది; మరికొందరిని పరిచయం చేసుకోవాలి-

కంపోజిటర్ ఒకవంక మేటరు కావాలని తొందర పెడుతూంటే, దారిని పోతూ చూడవచ్చిన మిసెస్ జోన్సుతో నవ్వుతూ మాటలాడ గలగాలి కంట్రీ ఎడిటర్. (కంట్రీ ఎడిటర్ అంటే చిన్న పట్నంలోని చిన్న పత్రిక ఎడిటర్) అలా విజిటర్లు వస్తూంటారు, పోతూంటారు; తన టేబిలూ గదీ తనే శుభ్రం చేసుకు, ప్రూఫులు దిద్దుకుంటూ, వ్యాసాలు చదువుకుంటూ యడ్వర్టయిజ్‌మెంటులు రాసుకుంటూ, పత్రిక పేజీలు ఆదరా బాదరా కట్టిస్తూ, ఏ వారాని కావారం ఒక యజ్ఞం పూర్తి చేయవలసి వుంటుంది కంట్రీ ఎడిటర్ అన్నవాడు. ఊళ్ళో ఏ మీటింగయినా పిలుస్తారు; ఏ సభ జరిగినా రమ్మంటారు; ప్రతి కమిటిలోను అతని పేరు కూడా చేరుస్తూంటారు. చివరకు, రాయడం కంటే మాటలాడటం ఎక్కువవుతుంది. ఏ ఒక్కరూ తన గురించి మంచిగా చెప్పరుగాని, ప్రతి వాళ్ళ గురించీ తను మంచి ముక్క అనాలి; కాలమ్ మేటరుని ఒక్క ముక్కలో చెప్పాలి; యిదంతా ఎందుకు, తనే ఒక డిక్షనరీ అయుండాలి.

సామాన్య ప్రజల మీద అతనికి గౌరవం ఉండాలి. పది మంది మంచికీ అతను చిహ్నం; ప్రజాస్వామ్యానికి పట్టుకొమ్మ. తన టేబుల్‌కి తను మహాప్రభువు; తన పత్రికకి తను చక్రవర్తి.

అటువంటి పత్రికా సంపాదకుడే మార్టిన్ లియాండీన్. డవునింగ్ టవున్‌కి 13 మైళ్ళ దూరంలో వున్న హనీబ్రూక్ లోని "నార్దరన్ ఛస్టర్ కవుంటి హెరాల్డ్" అను పత్రికకి అతను ఎడిటర్, పబ్లిషర్, ప్రొప్రయిటర్- మూడూను. పత్రికా ప్రచురణకి దిగడానికి పూర్వం అతను ఫిలడిల్ఫియాలో బాంకరు. అనవసరంగా, డబ్బు సంపాదనతో కాలం వృధా చేసుకోవడమేమిటని, బాంకరు పని మానేసి, భార్యా ముగ్గురు పిల్లలతో హనీబ్రూక్ వొచ్చి, ఈ హెరాల్డ్ పత్రిక కొన్నాడు. ఒకమారు వాళ్ళ ఆఫీసుమీద నిజంగా పిడుగుపడింది. పిడుగు పడ్డప్పటికీ కూడా వాళ్ళ పత్రిక ఆగలేదు. ప్రతీ వారం సక్రమంగా వెలువడుతూనే ంది.; అతని ఉత్సాహం వీసమంత కూడా తగ్గలేదు.

1946 వసంతకాలంలో నేను, బాబ్ హనీబ్రూక్ వెళ్ళాం : మాకు చాలా ఆందోళనగా ఉంది. నిలవవున్న డబ్బంతా అయిపోయింది ; ఆ లైనులో మాకు అనుభవమా అంటే, శూన్యం ; ఇద్దరికి భయంభయంగా ఉంది. ఆ భయమే మా యిద్దరిని మరింతగట్టిగా కట్టేసింది. మనసులో వున్న ఆందోళన పైకి చెప్పుకోడానికూ్కడా భయమే! హెరాల్డ్ పత్రిక అఫీసులోకి వెళ్ళాం. ఎర్ర యిటుకలతో కట్టిన నలుచదరపు యిల్లు అది. మా ప్రింటింగ్ బాధలు వీళ్ళు ఏమయినా తీర్చగలరేమో అనిపించింది - లోపల పాదం పెట్టీపెట్టగానే!

మార్టిన్ లియాండిన్ బాంకరులా ఉన్నాడుగాని చిన్న పత్రిక ఎడిటర్‌లా లేడు. చక్కటి సూటూ, కలకల్లాడే మొహం, నీలం కళ్ళకి తళతళామెరిసే బంగారపు కళ్ళజోడు - మనిషి బావు న్నాడు. మమ్మల్ని ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించాడు. "ఆర్కయివ్" కొన్న మెక్లవిన్ దంపతులు మీరే నన్నమాట. మిమ్మల్ని కలుసుకోడం చాలా సంతోషం - అన్నాడు.

మధ్య మధ్య టెలిఫోన్ కాల్స్‌కి జవాబు చెపుతూ, పనివారికి సూచన లందిస్తూ, మాతో చాలా సేపు సంభాషించాడతను.

"మీరు ఆర్కయివ్ కొనడం చాలా మంచిపని, ప్రింటింగ్‌ది ఏముంది - నేను ప్రింటు చేసి పెడతాను" అన్నాడు.

ఆ పూట మమ్మల్ని భోజనానికి వుండిపొమ్మన్నాడు. ప్రింటింగ్‌ది ఏముంది, నేను చూస్తానుగా - అంటూ మాకు ధయిర్యం చెప్పాడు. వార పత్రిక ప్రింట్ చేయడం అంతసులువా? కాదు. కాని మార్టిన్ లియాండీన్‌లోని విశ్వాసబలం మట్టుకు చెప్పుకోదగ్గది.

మొదటి మెట్టు దాటాం. మా పత్రిక ప్రింటు చేయించుకునేందుకు స్థలమంటూ ఒకటి దొరికింది. ఇంకో రెండు వారాలలో, పునరుజ్జీవింపబడిన ఆర్కయివ్‌ని, బయటికి తీసుకొద్దామనుకుంటూన్నాం.

మొట్టమొదట యడ్వర్టయిజ్ మెంటులు చూసుకోవాలి. మళ్ళీక్రొత్త ప్రారంభిస్తున్నాం గనక, మొదటి రెండు

సంచికలూ చాలా మందికి ఉచితంగా పంపుదామనుకున్నాడు. బాబ్ 3200 మందికి పంపుదామన్నాడు బాబ్; వర్తకులందరికి మనగురించి తెలియా లన్నాడు.

ప్రకటనదారు (యడ్వరయిజర్) ఎప్పుడూ పత్రిక్కి ఎంత ప్రచారం వుందో (సర్క్యులేషన్) అడుగుతాడు. సర్క్యులేషన్ పెరిగేందుకు మంచి మంచి బొమ్మలు, చక్కని వార్తలు, ఘాటైన విషయాలు సేకరించాలి. మంచి వార్తలు సేకరించడమెలా అనేది, మా ప్రధాన సమస్య అయింది.

మేమిచ్చేవార్తలు ప్రత్యేకత కలిగినవై ఉండాలి. పెద్ద పత్రికలు "చెడ్డపనుల"కి సంబంధించిన వ్యాసం మొదటి పేజీలో వేస్తాయి. గ్రామీణ పత్రిక అలా చేయడానికి వీల్లేదు. "మంచి పనులనే మొదటి పేజీలో వేయాలి. సభలూ, సమావేశాలూ, ఇరుగు పొరుగుల వుండే సుగుణ సంపత్తి – యివి ప్రాధాన్యత వహించాలి. పక్కనున్న అయిదారు గ్రామాల మంచి వార్తలు సేకరిస్తూండాలి; అప్పుడుగాని చుట్టుప్రక్కల గ్రామాల వారికి మా పత్రిక మీద అభిమానం కలగదు.

డవునింగ్ టవున్ వార్తలు నేనకి తాను చూసుకుంటా నన్నాడు బాబ్. వార్తాసేకరణ అంటే, ఎందర్ని తెలుసుకోవడానికి వీలో, అందర్ని తెలుసుకోవాలన్నమాట. చర్చి ఉద్యోగుల్ని చర్చి వార్తలు పంపమన్నాం; ఇక్కడు కార్మిక సంఘాలు వున్నాయి – ఆయా సంఘనాయకుల్ని వారి వారి వార్తలు పంపమన్నాం: – కార్మిక నాయకులు మేమేదో వేళాకోళం చేస్తున్నా మనుకున్నారు: ఎందుకంటే, వార్తలు పంపమని వారిని ఈ మాదిరిగా ఎవరూ అడగలేదింత వరకూ. మేము ఆయాసంఘాల వార్తలు ప్రచురించడం మొదలెట్టేసరికి, వారెంతో ఆనందించి, మాతో సహకరించ నారంభించారు. వర్తక సంఘం, క్లబ్, యువజన సమితి, స్కూలు కమిటీ, పురపాలక వర్గం – యిటువంటి వివిధ సంఘాల వార్తలు, మా పత్రిక చదివే పాఠకులకి కావలసి వుంటాయి. ఇంకా మొదటి సంచిక వెలువడక పూర్వం నుంచే, మీటింగులకి హాజరవడం మొదలెట్టాం.

రెండు కాలముల సంపాదకీయం విధిగా ఉండాలని బాబ్ అభిప్రాయం. మరొక పత్రికా సంపాదకుడన్నాడు. "సంపాదకీయా లెందుకు? వారపత్రికలోని సంపాదకీయా లెవరూ చదవరు. వాళ్ళకి కావలసిందల్లా పేర్లు – వాళ్ళ పేర్లు, వాళ్ల వాళ్ల పేర్లు."

"పేర్లూ వుంటాయి: కాని ప్రతి వారం రెండేసి కాలముల సంపాదకీయం వ్రాస్తాను" అన్నాడు బాబ్. 1964 మే 16వ తేదీ పత్రికలో అతను మొట్టమొదటిసారిగా వ్రాసి, కొట్టేసి, మళ్ళీ వ్రాసిన సంపాదకీయం ఇది.

(ఇంకా వుంది

—జేమ్ మెక్లవిన్

సీతామాలక్ష్మి · గోరింటాకు · త్రిశూలం · సీతారామ కళ్యాణం

కె.నరసింహనాయుడు

యువచిత్ర ఆర్ట్స్

# శ్రీనివాస కళ్యాణం

నిర్మాత కె.మురారి  దర్శకత్వం కోడి రామకృష్ణ

సంగీతం కె.వి.మహదేవన్  ఫొటోగ్రఫీ: నందమూరి మోహనకృష్ణ

# డైరీ

## 1987 జులై 27

'నిరీక్షణ' కథానాయికలో యింతటి నాట్య విద్య నిగూఢంగాదాగి వున్నదా అని, ఈసాయింత్రం మ్యూజిక్ అకాడమీలో, ఆమె కూచిపూడి, కథక్ నాట్య ప్రదర్శనలు చూసి వారికి అనిపించక మానదు. రాగమాలిక, జతిస్వరం సామాన్యంగా వున్నా, బాల గోపాల తరంగం నుంచి వేగం పుంజుకుంది; కళాకారిణి తన విద్యను వ్యక్తం చేయడంలో పూర్తిగా నిమగ్నురాలై, ప్రేక్షకులని రసార్ణవంలో ముంచి, మెప్పించింది. బాలూ మహేంద్ర ఆమెని ప్రేక్షకులకు పరిచయం చేశారు. ముఖ్య అతిథి బాల మురళీ కృష్ణ; సభాధ్యక్షులు యమ్మెస్ రెడ్డి. ఎనిమిదిన్నరకి ఒక ముఖ్యమైన పని వుండటంవల్ల నాట్య ప్రదర్శన చివరంటా చూడలేకపోయాను. నాట్య కళాకారిణిగా ఉజ్వల భవిష్యత్తు వుంది. అర్చనాకు - అర్చన కాదు, అర్చనా- ఆమె పేరులో మూడు అసులు కాదు, నాలుగు అసులు వున్నాయి.

## . . . . . 28

దర్శకులు విశ్వనాథ్, పూర్ణోదయా రాజా మాస్కోలోని ఇంటర్నేషనల్ ఫిలిమ్ ఫెస్టివల్‌కి వెళ్లివచ్చిన సందర్భంగా వారి ఆఫీసులో ప్రెస్ మీట్. నిర్మాత నాగేశ్వరరావు పాత్రికేయులకు స్వాగతం తెలిపినమీదట, విశ్వనాథ్ బర్మింగ్ హామ్‌లోను (ఇంగ్లాండు), స్టేట్స్‌లోను (అమెరికా) వున్న తెలుగు కుటుంబాలు, మన సాంస్కృతిక విలువలు గల చిత్రాల కోసం ఎలా ఎదురు చూస్తున్నదీ చెప్పారు. కెనడాలోని తెలుగువారు 'తెలుగు తల్లి' అనే పత్రిక వేస్తున్నారు. 1965 - 75 మధ్య కాలంలో వెళ్లిన వారు, పెళ్లీడు వచ్చిన తమ పిల్లల భవిష్యత్తు గురించి తికమక పడుతున్నారట. 'డేటింగ్'కి తల్లులు సమ్మతించినా, మన అమ్మాయిలని అనగా భారతీయులని గాని, ఆసియా వాసులని గాని - పెళ్లి చేసుకొనేందుకు, అమెరికన్ యువకులు ఎందరు సిద్ధపడతారనేది పెద్ద ప్రశ్న. ఈ విషయమై తెలుగులో రెండు మూడు మంచి నవలలు - అక్కడివారు వ్రాసినవి - వచ్చాయి.... ఆ తర్వాత రాజా, మాస్కోలోని 'సాగర సంగమం' విశేషాలు తెలిపారు. రష్యన్‌లో ఆ చిత్రాన్ని ఏ ఫొటోగ్రాఫ్ ఇన్ ది మారేజి ఆల్బమ్" (A Photograph in the Marriage Album) అన్నారట.... పబ్లిక్ రిలేషన్స్: అర్జునరావు.

## 30

"మన సంస్కృతీ స్రవంతిలో నృత్యమూ సంగీతమూ సమ్మిళితమై దైవారాధనలో దివ్యత్వం పొందు తున్నాయి. మహావిష్ణువు శేష తల్ప శాయి-అంటే పాము ఆయనకు పరుపు. పాముని మెళ్లో ధరించే పరమశివుడు నాట్యానికి అధిదేవత - నటరాజు. నృత్యానికి శివరూపమైతే, సంగీతాని రామావతారం గాని, కృష్ణావతారం గాని. కృష్ణలీలల చుట్టూ మన సంగీతం విశ్వ విపంచియై వినిపించింది. ఈ రూపాలన్నీ సంకేతాలనీ జీవాత్మ పరమాత్మతో చెప్పుకొనే నివేదనే మన సంగీత నృత్యాలనీ విబుధ వరులకు తెలుసు. ప్రాపంచిక జనితమై, పారమార్థికం వైపు పయనిస్తాయి మన కళలు .... సంస్కృతిక రాయబారిగా విదేశాలలో పర్యటించి వచ్చిన మాండ లిన్ శ్రీనివాస్‌కి మంచి భవిష్యత్తు వుంది" అన్నారు శ్రీపాల్ (డెరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్), కళారంజని వారు వుడ్‌లాండ్స్ ఏర్పరిచిన శ్రీనివాస్ సత్కార సభలో. కళారంజని అధ్యక్షులు రమణయ్యరాజా ఆహూ తులకు స్వాగతం తెలిపారు. "మాండ లిన్ శ్రీనివాస్ ఒక ప్రాడిజీ – ప్రాడిజీ అనగా వాలా చిన్నతనంలోనే ఎటు వంటి శిక్షణా లేకుండా అత్యున్నత కళా కౌశలం కనబరచడం. నాకు తెలి సిన నలుగురు ప్రాడిజీలలోను మధుర మణి అయ్యర్, ఫ్లూట్ మహాలింగం, గోటువాద్యం రవికిరణ్ తర్వాత నాలుగో వ్యక్తి ఈమాండలిన్ శ్రీని వాస్. మ్యూజిక్ అకాడమీ వేదికపై ఈ బాలునికి స్థానమిచ్చేందుకు ఎందరో విద్వాంసులు అభ్యంతరం చెప్పారు. కాని, వారిని అతి కష్టంమీద వొప్పించి యితనికి అవకాశం యివ్వగలి గాం" – అన్నారు మ్యూజిక్ అకా డమీ కార్యదర్శి పార్థసారథి .... 'నాదసుధానిథి' బిరుదు యిచ్చింది కళా రంజని శ్రీనివాస్‌కు. వయొలిన్ కన్యా కుమారిని, మృదంగ విద్వాంసుని సత్క రించడమయాక. రాజాలక్ష్మి ఫౌండే షన్ వారు వెలువరించిన 'లీలాకృష్ణుడు – దశమస్కంధం' (ఇంద్రగంటి శ్రీకాంతశర్మ వచనరచన) గురించి పరి చయ వాక్యాలు చెప్పారు పప్పు వేణు గోపాలరావు. పోతన భాగవతంలోని పసిడి వెలుగులు మచ్చుకి చూపారు చిన్న కృష్ణయ్య. తనకి వొనగూడిన అవకాశానికి కృతజ్ఞత వెలిబుచ్చారు శ్రీకాంతశర్మ. కళారంజని కార్యదర్శి పాండురంగ వందన సమర్పణతో సంగీత - సాహిత్య సభ ముగిసింది.

## 1987 ఆగస్టు 01

వసుంధరా ఎంటర్‌ప్రయిజెస్ వారు (నిర్మాతలు : నాగేశ్వరరెడ్డి, జగదీష్) బొంబాయి జమున నాయి కగా, వినోద్ నాయకుడుగా, సిల్క్ స్మిత ట్రుయిబల్ క్వీన్‌గా కేరళ అటవీ ప్రాంతాలలోను జలపాతాల సమీపాన అరవైరోజులు షూటింగ్ పూర్తి చేసిన 'టార్జాన్ సుందరి' పాటలు యమ్మెమ్ థియేటర్లో చూపారు.

ప్యాత్రికేయులకు, సినిమా స్కోప్‌లో నిర్మించిన మొదటి జంగిల్ చిత్రమిది తెలుగులో. వైజి మహేంద్రన్, మాడా మున్నగువారున్నారు. ఇళయరాజా సంగీతం. క్లయిమాక్స్‌లో ఇరవై అయిదు ఏనుగులు పాల్గొన్నాయట. చూపించిన నాలుగు పాటలు జంగిల్ చిత్రానికి సరిపడ మోతాదులో వున్నాయి. పి ఆర్ ఓ: అర్జునరావు.

.....02

కోడి రామకృష్ణ దర్శకత్వంలో రూపొందుతున్న యువచిత్రా పిక్చర్‌కి 'శ్రీనివాస కళ్యాణం' అని నామకరణం చేసినట్లుగా నిర్మాత మురారి, సవేరా ప్రెస్ మీట్‌లో చెప్పారు. వినిపించిన ఆరు పాటలూ సంగీత సాహిత్య రసగుళికలు— వేటూరి, సిరివెన్నెల, జొన్నవిత్తుల రాసినవి - 'ఎందాక ఎగిరేవమ్మా గోరింకా-పొద్దు వాలినాక గూటికి చేరుకోక', 'తుమ్మెదా, పొద బాటుకు పద పదమని సొద పెడతాడే' 'చెప్పుకుంటే సిగ్గుచేటు' 'కొత్తపాట నేర్చుకో కోకిలమ్మ నెమలిగుమ్మా ; 'తొలిపొద్దులో హిందోళం, మలి పొద్దులో భూపాలం', 'సమ్మోహనా మోహినీ. సరసవీణ శృతిచేయనీ' .... ప్రతి పాటా శ్రవణానంద దాయకంగా మనుసుని తాకే మంజుల గీతిక .... బుసకొట్టే కాలం అగ్ని నాగు కాగా హృదయం నిగ్గు తేలుతుందట. ప్రణయానికి మరోపేరు జ్వలనములు ; వెంకటేష్.గౌతమి, నాయకా నాయికలు. కథ, మాటలు సత్యమూర్తి వి. తుమ్మెద, గోరింక, కోకిల, నెమలి — ఈ నాలుగింటి ప్రస్తావన వుంది ఈ చిత్రంలో. వాటికి తోడు కాల నాగు కూడా, పాటలు వినడం వరకే! తొందరలో చిత్రీకరణతో చూపిస్తామన్నారు నిర్మాత మురారి.

....04

యార్లగడ్డ శంభుప్రసాదు (స్వర్గీయ రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరీల ఏకైక కుమారుడు) జన్మదినం ఆ దంపతుల పేరు మీదుగా స్థాపించిన కళాపీఠం వారు ఏటాయిచ్చే బహుమతి ప్రదానోత్సవం, సావిత్రి స్మారక బహుమతి అందాలనటుడు శోభన్‌బాబుకి అందజేయడం. (గత నాలుగేళ్లుగా సావిత్రీ యవార్డ్ అందుకున్నవారు; నాగేశ్వరావు, శారద, షావుకారు జానకి, సుహాసిని - ఈ సంవత్సరం శోభన్ బాబు. కళాపీఠం తరఫున షావుకారు జానకి శోభన్‌బాబుకి అందజేశారు।.... కాంతిమతి కళ్యాణ మండపంలో 'కళాపీఠం' మేనేజింగ్ ట్రస్టీ శంభుప్రసాద్ స్వాగత వచనానంతరం, నాగభైరవ కోటీశ్వరరావు 'కవన విజయం' అనే రూపకంతో ప్రారంభమయింది ఫంక్షన్. 'భువన విజయా'నికి యిది ప్రత్యామ్నాయం గాని, పారడీగాని కాదని చెప్పారు ప్రయోక్త. ప్రబంధ పరమేశ్వరశాస్త్రి నుంచి క్షుద్ర సాహిత్యపు భద్రయ్య దాకా. కవన, వచన రచనా రీతులలోని వేరు వేరు శాఖల వ్యంగ్య రూపకం. ప్రాచీన కవిత, భావకవిత, అభ్యుదయ కవిత, ప్రణయ కవిత,

దిగంబర కవిత, విప్లవ కవిత, మినీ కవిత, సినీకవిత, హాస్యకవిత, ప్రేమ సాహిత్యం (యద్దనపూడి సులోచనా రాణి వరవడి నవలలు), క్షుద్రసాహిత్యం (యండమూరి వీరేంద్రనాథ్ వరవడి నవలలు). ఒకొక్కరు ఒకొక్క శాఖకు ప్రతినిధులై భావ వ్యక్తీకరణ గావించారు. ఈ 'కవన విజయ' కావ్యగోష్ఠికి క్లర్కు సుబ్బారావు అధ్యక్షుడు (ముప్ఫయ్యేయిదేళ్ల నాటి ఆరుద్ర సృజన 'క్లర్క్ సుబ్బారావు' - ఆత్రేయ 'యన్‌జిఓ' గాని, ఆరుద్ర 'క్లర్క్ సుబ్బారావు' గాని ఈనాడు లేరు. 'యన్‌జిఓ'ల సంఘటితశక్తి ప్రభుత్వాన్ని ఎలా గడగడ లాడించేది చూశాం - చూస్తున్నాం). అధ్యక్ష పీఠమలంకరించిన క్లర్క్ సుబ్బారావు, తన మీద పద్యం చెప్పమంటూ, కవితా ప్రాంగణంలోకి ప్రవేశిస్తాడు. ప్రతి ఒక్కరూ ఆయాశాఖలకు చెందిన కవితలు ఎంతో హృద్యంగా చెప్పారు - సభను రంజింపజేశారు. కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, చెరబండరాజు మున్నగువారు ఆ కవితాగానంలో కనిపిస్తున్నప్పటికీ హాయిగా నవ్వుకుంటాం.... "మీ కవిత లెవరు చదువుతున్నారు ? ఎవరికీ కావాలి ? ఎందరికి బోధపడు తున్నాయి ? మీలో మీరు 'ఇజా'ల కోసం వాదులాడుకోవటం తప్ప పాఠకాభిరుచి మీకేం తెలుసు ? ఈ లోకంలో ముఖ్యమైనవి రెండే. ఒకటి డబ్బు ; రెండోది : ప్రేమ. ఈ రెంటినీ నేను మనోజ్ఞంగా చూపించి, ఊహాలోకాల పయనింపచేస్తున్నాను. గనకనే, కూరలు తరుగుతూ ఇల్లాలూ, క్లాసు పుస్తకాల మధ్య పెట్టుకొని విద్యార్థినా నవలలు చదువుతున్నారు ; రమ్యానందలోకాల విహరిస్తున్నారు. క్లర్క్ సుబ్బారావూ, కనీసం ఊహాలలోనైనా షెవర్లెట్ కారెక్కి, మల్లెపూలు జడలో తురుముకు బంగాళా పోర్టికోలో నీ కోసం ఎదురుచూసే భార్యని ఊహించుకో" - అని నవలా రచయిత్రి నాంచారీదేవి (నెల్లూరు సిద్దార్థ కాలేజీలో తెలుగు లెక్చరర్ గిరిజ) వ్యంగ్య ధోరణిలో చెప్పినప్పటికీ, సమస్త రచనా వ్యాసంగమూ ఊహాలనిచ్చేనలోని మెట్టే కదా అని, అనిపించక మానదు. . . . అర్ధ రాత్రి, అమావాస్య, ఊరవతల స్మశానం, మండేకాష్టాలు, భూతప్రేత్రాలు, గాలి దెయ్యాలు - యిటువంటి అద్భుత భయానక రసాలతో పాఠకులని వుక్కిరి బిక్కిరిచేసే క్షుద్ర సాహిత్యపు భద్రయ్య, తన చెప్పేదొక్కటీ నమ్మడు ; కాని, చదివేవారికి నమ్మకం కలిగేటంత నేర్పుగా చెబుతాడు. ఎందుకంటారా ? చదివింప జేసేందుకు ..... ఆరేసుకోబోయి పారేసుకున్న సినిమాకవి చిరపరిచితుడు గనక ఆయన గురించి ప్రత్యేకంగా చెప్పేదేమీలేదు. మందువుంటేనే రాస్తాడు ; మందు మైకంలో పాటలు అల్లుతాడు .. .. వచనం రాసేవారిలో 'సరుకు అమ్మకం' ప్రధాన లక్ష్యమనీ, కవిత చెప్పేవారి కంఠం వినిపించేది బహు కొద్దిమందికే, అయినా, వారి కవితలోని చిత్తశుద్ధి శంకింపనవసరం లేదనీ సూచన ప్రాయంగా మనకి స్ఫురిస్తుంది.

వచనం పాలువంటిదైతే, కవిత్వం పాలకోవా ... అంతా బావుంది గాని చివరి సమస్య మాత్రం ('అంగము చేతబట్టుకొని ఆడిరి పండితులంద రున్') మా దృష్టిలో సభ్యతా విరుద్ధం. పంచాంగమనీ, రాజ్యాంగమనీ పద్యాలు చెప్పినప్పటికీ అశ్లీలధ్వని పోదు. బహుమతి ప్రదాన సభకు యమ్మెస్ రెడ్డి అధ్యక్షత వహించగా, బెజవాడ గోపాల రెడ్డి ముఖ్య అతిధి. స్వాగత వచనం : బియస్సార్.

06

"వెనకటి సమస్యలకు నేటి సమస్యలకు సామ్యం లేదు. కాలగమనంతో పరిస్థితుల స్వరూపం మారిపోతోంది ; ఆ మారిన పరిస్థితుల నుంచి కొత్త ప్రశ్నలు, కొత్త సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. స్త్రీకి ఈనాడు అన్ని రంగాలలోను సమాన ప్రతిపత్తి వుంది. అయితే, సాంఘికమైన కట్టడులు దురాచారాలు నుంచి కొందరు బయట పడలేకుండా వున్నారు.... అవివాహిత మాతలు— ('Unwed, Mothers) వయోవృద్ధులకు వసతి గృహాలు (Old-Age Homes) యువతీయువకులని మాదక ద్రవ్యాలనుంచి మళ్లించడం (Drug Addiction), వైద్యసదుపాయం (Medical Care)— ఇలాటివి కొన్ని మేము ఈనాడు చేబడుతున్నాము. మాకు కావల్సింది అధిక సంఖ్యలో సభ్యులు, విరాళాలూ కాదు. సేవాభావంతో యిటువంటి కృషికి అంకితం కాగల కార్యతత్పరులు సంఘసేవలో గుర్తింపు అంటూ ఏమీ వుండదు— అది మానసికమైన తృప్తిని మాత్రమే యివ్వగలుగుతుంది" — అన్నారు ఈ ఉదయం ప్రెస్‌క్లాబ్స్ పత్రికా సమావేశంలో, అనుభవజ్ఞులు, ప్రఖ్యాత సంఘసేవా పరాయణి, ఇండియన్ వుమెన్స్ కౌన్సిల్ ఫర్ సోషల్ యఫైర్స్‌కి (Indian Women's Council for Social Affairs) అధ్యక్షురాలూ అయిన లక్ష్మి రఘురామ్. కేంద్ర కార్యాలయం ఢిల్లీలో గల ఈ కౌన్సిల్ వివిధ స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా అనేక కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహిస్తోంది. మద్రాసులోని ఈ కౌన్సిల్ సభ్యులలో శకుంతలా శేషాద్రి, బారిస్టర్ లీలా మీనన్, భారతీబాజీ ముమ్మన్నుగువారున్నారు.

. . . . 09

మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్టస్ అసోసియేషన్ వారు, 'మీట్ ది ప్రెస్ కార్యక్రమాన్ని సూపర్‌స్టార్ చిరంజీవితో ఈ ఉదయం పామ్‌గ్రోవ్ – 'ఊర్వశి'లో ఏర్పాటు చేశారు. ఉపన్యాసాలుగాక, ప్రశ్నోత్తరాలుగా సాగితే బావుంటుందన్నారు చిరంజీవి - అసోసియేషన్ అధ్యక్షులు అర్జున రావు, స్వాగతం తెలిపాక! స్లంప్ ప్రభావం, హీరోల రేట్లు పెరగడంలో నిర్మాతల బాధ్యత, పరిశ్రమలోని అన్ని వర్గాల సహకారం, కొనుగోలుదారుల పోటీ, తను స్థాపింపనున్న ఛారిటబుల్ ట్రస్ట్, రాజకీయాలుగాక వైద్య సదు

పాయంలోను, విద్యారంగంలోను యితోధిక సేవచేయాలనే తన అభిలాష - యిలాంటి వెన్నో విష యాలు మనసువిప్పి మాట్లాడారు చిరంజీవి. సక్సెస్‌తోబాటు వినయ సౌశీల్యాలు పెంచుకొన్న చిరంజీవికి, ఆయన జన్మదిన సందర్భంగా (ఆగష్టు 22) మా శుభాకాం క్షలు.... సాయంత్రం జర్మన్ హాలులో శ్రీనాథ్ ఆర్ట్ వారి 'నాకూ పెళ్లాం కావాలి' శతదినోత్సవ వేడుకలు. చంద్రమోహన్, రాజేంద్రప్రసాద్, కల్పన, నిశాంతి ఈ చిత్రంలోని జం టలు. పాండ్యరాజా తమిళమాతృకకి యిది తెలుగు .... "యవ్వనం కాటే సింది" చిత్రంతో విజయానికి మారు పేరైన విజయ బాపినీడుతో స్నేహం ప్రారంభమయింది. విజయ సాధన లోని కిటుకులు ఆయనకు తెలిసినం కగా మరొకరికి తెలియవని నిస్సంకో చంగా చెప్పవచ్చు" - అన్నారు అధ్యక్షత వహించిన దాసరి నారాయ ణరావు. తనని 'మగమహారాజు' చేశా రని చిరంజీవి అనగా, ఏ పరిస్థితులలో విజయ బాపినీడు దర్శకత్వ బాధ్యత వహించినదీ చెప్పారు చంద్రమోహన్. రాఘవేంద్రరావు, తాతినేని రామా రావు, భానుప్రియ జ్ఞాపికలను అంద జేశారు. కాశీవిశ్వనాథ్ మాటలు, వాసూరావు సంగీతం గల ఈ కామెడీ చిత్రానికి నిర్మాత : జె మురళీమోహన్. నిర్మాణత : శివలింగేశ్వరరావు. సమ ర్పణ : ఆలపాటి రంగారావు. ఆంధ్రా, నైజామ్ పంపిణీ దారులు : సురేష్. కడప: రమణామూవీస్; ఏలూరు: అన్నపూర్ణా సినీచిత్ర .... పబ్లిక్ రిలేషన్స్ : జగన్ .... పది గోడ గడియారాలతో ఒకటైనా తమకి వస్తుందేమోనని, దాసరి నారాయణ రావు చెప్పినట్లు తమ అదృష్టం పరీ క్షించుకునేందుకు, చివరంటా కూచు న్నారు వచ్చినవారందరూ.

.... 10

ఏదేశపు జానపద సంగీతంలో నైనా, అక్కడి ప్రజల జీవస్పందన వినిపిస్తుంది. నా ఊరు నా నేల, నా మనుషులు, నాదైన వాతావరణం - యివి నరనరాల్లో జీర్ణించుకుపోతాయి. డస్ట్ స్టామ్‌లో (Dust Storm) చతు ష్పాదులు గిలగిల్లాడటం, కాలిఫోర్ని యా తోటలలో కుటుంబం యావ న్మందీ పనిచేయడం, కొలంబియా నదీ జలాలను ఆనకట్ట ద్వారా మచ్చిక చేసుకోవడం, విశాలమైన బయళ్లలో నారింజ కాంతులు - వీటి గురించీ, ప్రజా జీవితంలోని కష్టసుఖాల గురించి వుడీగుత్రి (Woody Guthrie) కట్టిన పాటలూ పాడిన పాటలూ అమెరికన్ జానపద సంగీత సాహి త్యంలో అజరామరమయాయి. రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం అతని పాటొకటి మిలియన్ రికార్డులు అమ్మి నదీ అంటే, ఆ ప్రజాదరణ వెనక గల హృదయ గానం ఊహించుకోవచ్చు. 75 నిముషా ఈ చిత్రం మనని ఈ శతాబ్ది ముప్ఫయిలూ నల భైలలోకి తీసుకువెళ్లి, వాల్ట్ విట్‌మాన్ 'లీవ్స్

ఆఫ్ గ్రాస్'ని (Walt Whiteman's Leaves of Grass') సంగీతపరంగా స్ఫురింపజేస్తూ, గడిచిన కాలంలో విహరింపజేస్తుంది. అమెరికన్ సెంటర్లో ఆహ్వానితులకు చూపారు ఈ సంగీత చిత్రం— 'వుడీ గుత్రీ', ఆయన జీవిత విశేషాలతో !

. . . . . 11

ఏకనాథ్ వీడియో కాసెట్ మాగజైన్ (Eknath Video Cassette Magazine) ప్రారంభ సంచికను సూపర్ స్టార్ కృష్ణ రిలీజ్ చేయగా సుప్రీమ్ హీరో చిరంజీవి అందుకొన్నారు. సభాధ్యక్షులు : ఇండియన్ బ్యాంక్ ఎగ్జిక్యూటివ్ డైరక్టరు గోపాలకృష్ణన్. 'ఫ్యూచర్ షాక్' రచయిత 'పేర్కొన్న కమ్యూనికేషన్ విప్లవం గురించి గొల్లపూడి మారుతీరావు, సినీ పరిశ్రమను ప్రజలకు చేరువగా తీసుకువెళ్తున్న ప్రయోగం గురించి ఏడిద నాగేశ్వరరావు, వీడియో షోకి, థియేటర్ ఫిలిమ్‌కి గల స్థానం గురించి కృష్ణ, డ్రాయింగ్ రూమ్‌లోకి తమ అభిమాన హీరోలను పట్టుకెళ్లే ప్రయత్నం గురించి చిరంజీవి ప్రస్తావిస్తూ, ఏక్‌నాథ్‌కి శుభాకాంక్షలు తెలిపారు. తమిళ పత్రికకు సుందర్‌రాజన్, తెలుగుకి అర్జునరావు సహకరిస్తున్నారు. ఏడున్నరకి 'ప్రసాద్ 70 యమ్మెమ్'లో మరొక కార్యక్రమం వుండటంవలన తెలుగు పాత్రికేయులకు ప్రథమ సంచికను యివ్వాళ చూడగల అవకాశం లేకపోయింది - రెండు మూడు రోజులలో ప్రొజెక్షన్ ఏర్పాటు చేస్తారు.......... "మా మూ లు పిక్చరుకి నాలుగు సౌండ్ ట్రాక్స్ వుంటాయి - డైలాగ్‌కి, మ్యూజిక్‌కి, సాంగ్స్‌కి, ఎఫెక్ట్సుకి: 70 యమ్మెమ్‌లో అయితే ఆరు మాగ్నెటిక్ సౌండ్ ట్రాక్స్ వుంటాయి — ఒకొక్క వైపున మూడేసి చొప్పున ! ఈ ఆరింటినీ సమ్మిళితం చేసే కార్యక్రమమే మిక్సింగ్. ఫోర్ ట్రాక్ (Four - track) మిక్సింగ్ రెండు మూడు రోజులు పడితే. సిక్స్ ట్రాక్‌కి (Six - track) కనీసం నెల్లాళ్లు పడుతుంది.... 70యమ్మెమ్ పిక్చర్‌ని, సినిమా స్కోప్‌లో షూట్ చేసి, 35 యమ్మెమ్‌కి, 70 యమ్మెమ్‌కి మార్చుకుంటారు. 70 యమ్మెమ్ కెమెరా మన దేశంలో లేదు - విదేశాల నుంచి కెమెరానీ సాంకేతిక నిపుణులనీ రప్పించుకోవాలంటే, తలకు మించిన భారం, హిందీ ఫీల్డ్‌లో కూడా ఎవరూ ఆ పని చేయలేదు — చే య లే రు.... 70 యమ్మెమ్ ఒకొక్క ప్రింటుకి లక్షా ఏభై నుంచి రెండు లక్షల దాకా అవుతుంది. హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, కాకినాడ - ఈ నాలుగు పట్నాలలోనే 70 యమ్మెమ్ రిలీజవుతుంది - మిగతా అరవై ........ అయిదు ప్రింట్లూ 35 యమ్మెమ్‌లో.... .... తెలుగులో యిది రెండవ 70 యమ్మెమ్ చిత్రం - మొదటిది 'సింహాసనం' .... ఇంత సొమ్ము వెచ్చిస్తున్నప్పుడు, కథా గమనంలోని నాటకీయతకు, సంచలన కా ర క మ యే యాక్షన్‌కు, బహు జనామోదకరమగు అంశాలకు ప్రా ము ఖ్య మి వ్వక

తప్పదు" — అన్నారు వెంకట్ అక్కినేని (అన్నపూర్ణా స్టుడియోస్), ప్రసాద్ 70 యమ్మెమ్‌లో 'అగ్ని పుత్రుడు'లోని ఒక రీల్, పాత్రికేయులకు చూపించిన తర్వాత జరిగిన గోష్టిలో, సాంకేతిక విషయాలు ఎంతో చక్కగా విడమరిచి చెప్పారు వెంకట్. నాగేశ్వ రావు, నాగార్జున యిందులో తండ్రీ కొడుకులు. యజ్ఞోపవీతం విసర్జించి వచ్చిన కొడుకుతో, తండ్రి ఘర్షణపడ తాడు, కొడుకు, యిల్లు వొదిలి వెళ్లి పోతాడు— 'చైతన్య' చూపిన ఉదయకాంతిలోకి. తల్లి (శారద) అస హాయురాలు.... వారానికి నాలుగైదు సినిమాలు చూసే మాకే మిగతా కథ ఎప్పుడు చూస్తామా అనిపింపజేసింది ఆ ఒక్క రీలూ, 'అగ్నిపుత్రుడు' ఒక టీవీ కావ్యమవవచ్చు.... పిఆర్ఒ: జగదీష్‌బాబు.

... 12

రెండు షెడ్యూల్స్‌లో పూర్తయి విడుదలకు సిద్ధంగా వున్న కుటుంబ గాథా చిత్రం, ఉషాకిరణ్ వారి 'చందమామ రావే' ప్రెస్ మీట్ పామ్ గ్రోవ్‌లో.... "కథకుడు చెప్పిన విషయానికి మెరుగులు దిద్దిన కలుపుగోలు మనిషి డైరక్టరు మౌళి.... సుజిత కోసం మరికొన్ని సన్నివేశాలు పెంచవలసి వచ్చింది ఈ ఫామిలీ సెంటిమెంట్ పిక్చర్లో" - అన్నారు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ అట్లూరి రామారావు. ఐశ్వర్యమే తప్ప తల్లిదండ్రుల మమ తానురాగా లెరుగని నాలుగెదేళ్ల బాలిక చుట్టూ అల్లిన యితివృత్తం.... "ఇప్పటికి యిరవై సినిమాలు డైరక్ట్ చేశాను. కాని, ఉషాకిరణ్‌తో అనుభవం భిన్నమైనది. సమస్తం ప్లాను ప్రకారం జరగడమే తప్ప దేనికీ తడుము కోవడం గాని, వెయిట్ చేయడం గాని ఉండదు. ఆఫీసులో నియమాల ప్రకా రం పనులు ఎలా జరుగుతాయో, షూటింగ్ కార్యక్రమమూ అంతే, నమ్మ శక్యంగానంత పెర్‌ఫెక్షన్. 7500 పూరిళ్లూ, 25 వేల జనాభాగల 'స్లమ్'లో (బేగంపేట విమానాశ్రయ సమీ పాన) నాలుగేళ్ల బాలతో, ఆ బాలకు ప్రియమైన పిల్లిపిల్లతో, ఈ పిక్చర్ రూపొందించాము" - అన్నారు దర్శ కులు మౌళి. చంద్రమోహన్, నూతన్ ప్రసాద్, మాడా, కల్పన, రాజ్యలక్ష్మి, పద్మిని మున్నగువారున్నారు.

..... 13

'కంప్యూటర్స్ ఎట్ వర్క్' (Computers at Work) మొదటి రెండు భాగాలూ చూడలేకపోయాను - కనీసం మూడవ భాగమైనా చూదామని వెళ్లాను అమెరికన్ సెంటర్‌కి.... ఇందులో టెలిప్రాసెసింగ్ సిస్టమ్స్ (Teleprocessing Systems) డాటా బేస్ ప్రాసెసింగ్ సిస్టమ్స్ (Database) Processing Systems) డిస్ట్రిబ్యూటెడ్ ప్రాసెసింగ్ సిస్టమ్స్ (Distributed Processing Systems) మైక్రో కంప్యూటర్స్ (Micro computers) ఈ నాలుగు గురించి గురు శిష్య సంవాదంలా చెప్పింది

డియో ఫిలిమ్. యజమాని- సేవకుడు (Master - Slave) బాంధవ్యంలా ఒక కంప్యూటర్ నాలుగైదు కంప్యూటర్లకి ఎలా పనులు నియోగించేదీ వివరించాడు వాఖ్యాత. కంప్యూటర్‌కి జీవాన్ని యిచ్చేది మెమరీ చిప్ (memory chip). మనిషి చెప్పిన పనులు మనిషికంటె విశిష్టవంతంగా చేయగలుగుతుంది కంప్యూటర్. మైక్రో ప్రాసెసర్ (micro processor) టైపురైటర్లూ, కాలుక్యులేటర్లూవలె తొందరలోనే వ్యాప్తిలోకి వస్తుంది. ఈ కంప్యూటర్లలో కూడా హైటెక్‌కి సంబంధించినది వేరు; గృహోపకరణం వేరు. కలర్ టివి, విసిఆర్ తర్వాత మనం స్వాగతం పలికేది మైక్రో కంప్యూటర్‌కి.

. . . . 14

"ఊర్వశి శారద ఏ పిక్చర్లో వుంటే, అది విజయవంతమవుతోంది. విజయలక్ష్మిని ఆకట్టుకోగల విఖ్యాత నటనా కౌశలం ఆమెలో వుంది. నిర్మాతలు జికె రెడ్డి, శివన్నారాయణ సాధించిన ఈ సక్సెస్, 'స్లంప్' కి ఒకవిధంగా ఉద్వాసన," - అన్నారు సభాధ్యక్షులు సుబ్బరామిరెడ్డి, హోటల్ పామ్‌గ్రోవ్‌లో జరిగిన 'లాయర్ భారతీదేవి' శతదినోత్సవ వేడుకల సందర్భంగా.... "మిత్రులు త్రివిక్రమరావుకి వరప్రసాదంగా జన్మించిన కళ్యాణచక్రవర్తి, మాకళ్లముందు పెరిగి పెద్దవాడైన బాలుడు, న్యూఁరోజుల పండగ హీరోగా ఈ వేదికపై ఆశీనుడవటం, తమ్ముని దీవించడానికి అన్న



గ్రాండ్ కీలీ డామ్ అమెరికా కెనడా దేశాల సరిహద్దులో 151 మైళ్ళ మేర పరుచుకుని ఉంది. కొలంబియా నదిపై నిర్మించిన ఈ అనకట్ట పొడవు 4.570 అడుగులు ఇక్కడి జలాశయాన్ని రూజువెల్టు లేక అంటారు.

బాలకృష్ణ యిక్కడికి రావడం నాకెంతో సంతోషంగా ఉందో చెప్పలేను. నన్ను ఈ సినీరంగంలో ప్రవేశపెట్టినది బాలకృష్ణ తండ్రిగారూ, కళ్యాణ చక్రవర్తి తండ్రిగారూను (యన్‌టి రామారావు - త్రివిక్రమరావు)" – అన్నారు డివియస్ రాజు, చిత్ర విజయానికి తోడ్పడ్డ వారందరినీ అభినందిస్తూ. తెలుగులో నాలుగు మాటలు మాట్లాడి సభను రంజింపజేశారు రాధ. బహుమతి ప్రదానం యిత్యాదులు మామూలు పద్ధతిలో జరిగాయి. నిర్వహణ : నూతన్‌ప్రసాద్

## 17

తామేదో భాగ్యవంతులమనుకొని, కలల ప్రపంచంలో విహరిస్తూ వచ్చిన థామస్ విలియమ్స్‌కి పదమూడో ఏట మొదటిసారిగా తెలుస్తుంది తమ బీద రికం! పల్లీలు కొట్టి హైస్కూలుచదువు పూర్తిజేసి, కాలేజీలో చేరుతానంటాడు విలియమ్స్. 'నా దగ్గర డబ్బు లేదు - నీకుగా నీవు సంపాదించుకు చదువు కుంటే నాకు అభ్యంతరం లేదు' - అని తండ్రి. ఆ ప్రకారమే ఐయొవా యూనివర్శిటీలో చేరి, కష్టబడి చదువుకు పట్టభద్రుడవుతాడు. ముప్ఫయిలలోని ఆర్థిక మాంద్యం వల్ల అతని కెక్కడా పని దొరకదు. కాయ కష్టంతో పొట్ట పోసుకుంటూ, దేశమంతా తిరుగుతాడు. - చివరికి హాలివుడ్‌లో చిన్న జాబ్ దొరుకుతుంది - యమ్‌జియమ్ వారి స్టోరీ డిపార్‌మెంటులో. అయితే, అక్కడ వేతనం తీసుకుంటూ బయట పత్రికలను రచనలు పంపడంతో, ఆరు నెలల్లో ఉద్వాసన చెబుతారు. అప్పటికే నాటికలూ అవీ రాస్తున్నాడు టెన్నెసి విలియమ్స్ (థామస్‌ని టెన్నెసిగా మార్చుకున్నాడు - టెన్నెసి రాష్ట్రంతోగాని, వాలీతోగాని యితనికెటువంటి సంబంధం లేదు). తమాషా ఏమిటంటే, ఏ విలియమ్స్‌నైతే యమ్‌జి యమ్ బర్తరఫు వేసిందో, ఆ టెన్నెసి విలియమ్స్ నాటకాన్నే 'కాట్ ఆన్ ఎ హాట్ టిన్ రూఫ్' (Cat on a Hot Tin Roof)) రిచర్డ్ బ్రూక్స్ దర్శకత్వంలో పాల్ న్యూమాన్, ఎలిజబెత్ టేలర్ నాయకా నాయికలుగా, బర్ల్ ఇవిన్, జూడిత్ యాండర్సన్‌లతో పిక్చర్ తీసి ఆస్కార్ అవారులు పొందింది.... బిగ్ డాడీకి 28 వేలఎకరాలభూమి,భవంతులూ,యితర ఆస్తులూ, ఎంతో ఐశ్వర్యం ఉంది. పెద్ద కొడుక్కి నలుగురు పిల్లలు ; పుట్‌బాల్ ప్లేయరైన రెండో కొడుకు, కాలు విరగడం వల్ల క్రచెస్‌తో నడుస్తూ వుంటాడు. భార్య మాగీ అందగత్తె. - అవిటి భర్తకు మరింత జెలసీ.... కొడుకుల్నీ కోడళ్లనీ మనుమల్నీ చూడటానికి తన 65 వ జన్మదినం నాడు వచ్చిన బిగ్ డాడీ, అందరి అసలు రూపాలూ తను తెలుసుకు, మనకి చూపిస్తాడు. అందమైన అబద్ధాలు, సమయస్ఫూర్తితో మాటకు మాట, అంతరంగంలోని ఆశని కప్పి పుచ్చే వాక్చతురిమ - ముప్ఫయి మూడేళ్లు గడిచినా కొన్ని చిత్రాలు నిత్య వసంతాలు - నాటకాల్లా !

## 18

శైలజా కంబైన్స్ వారి 'మదన గోపాలుడు' పాటల ప్రొజెక్షన్ 'దేవి - శ్రీదేవి' లో.... 'మగువల పాలిట మన్మథుడు మన్మథలీలకు ఆత్రేయుడు' ఆ ఊళ్లో మదనగోపాలుడై మకాం పెట్టాడట (ఆత్రేయ గేయం - బాలూ గాత్రం).... 'వాన వచ్చి వయసుకి వరదతేగా, పైన తడిసి, లోపల వేడి పుట్టడం' - రాజేంద్ర ప్రసాద్ రమ్య కృష్ణలపై చిత్రీకరణకు, యస్పీ, చిత్రల గాత్రం. 'ప్రమదల ఆశల ప్రమిదల



పూజ్యులు డాక్టర్ వియస్ శర్మ శర్మాదంపతులు స్థాపించిన చిల్డ్రెన్స్ గార్డెన్ స్కూలు 1987 సెప్టెంబరులో స్వర్ణోత్సవం జరుపుకుంది

రూపం కార్తీక దీపం' (ఆత్రేయ రచన - వాణీ జయరాం, శైలజ, మాధవపెద్ది రమేష్ మున్నగువారి కోరస్) భావ యుక్తమూ నేత్రోత్సవమూను. బతక డం నీకెంత కష్టమైనా - చావడం నీ యిష్టమేనా ? '(ఆత్రేయ గీతం - యస్పీ, సుశీల).... తోటకూర ఆశా లత కథ, కృష్ణమోహనరెడ్డి దర్శ కత్వం : నిర్మాత : సురేంద్రనాథరెడ్డి ; సమర్పణ : ఆర్ డి రెడ్డి .... ప్రొజె క్షన్ అనంతరం మురళీమోహన్ ఇంట్లో పత్రికాగోష్ఠి. 'టానా' (తెలుగు అసోసి యేషన్ ఆఫ్ నార్త్ అమెరికా) ఆహ్వా నంపై, వారి ఆరవ వార్షికోత్సవానికి వెళ్లిన మురళీమోహన్, తన అమెరికా పర్యటన విశేషాలు తెలిపారు. 'టానా' ఉత్సవంలో (జులై 11, 12) సుమారు మూడు వేలమంది తెలుగువారు పాల్గొ న్నారట. డెట్రాయిట్, క్లీవ్‌లాండ్, నయాగరా ఫాల్స్, డిస్నీలాండ్ మున్నగునవి చూశారట మురళీ మోహన్ దంపతులు : అక్కడ ప్రజల సుశిక్షణ, కార్య దక్షత, విశాలమైన రాచబాటలు, లింకన్ మెమోరియల్ వంటి చారిత్రాత్మక శిల్పాలు వారి నెంతగానో ఆకట్టుకున్నాయి. 'లా - వెగాస్'కి కూడా వెళ్లానన్నారు మురళీ మోహన్. (ప్రపంచ ప్రఖ్యాత జూద గృహం లా-వెగాస్ - పన్ను రూపేణా ఎన్నో మిలియనులు వసూలు చేస్తుంది అమెరికా ప్రభుత్వం). 'ఎంత కాశారు?' అన్న ప్రశ్నకు, 'నూరు డాలర్లు అను కున్నాను - అవి పోగానే బయట కొచ్చేశాను' - అన్నారు మురళీ మోహన్ నవ్వుతూ.... ('గాడ్ ఫాదర్' నవలా రచయిత మేరియో పుజో 'రోజుకి ఇరవైవేల డాలర్లు' అని లా. వెగాస్ జూదవినోదానికని కేటాయించే వాడు. ఇరవై వేల డాలర్లు అంటే రెండున్నర లక్షల రూపాయలు - ప్రతి రోజూ సరదాకని అంతసొమ్ము వెచ్చించ గల కోటీశ్వరులని సృష్టించే సంపన్న దేశం అమెరికా. కాగా సొమ్ము ఒక్క చోట పేరుకుపోనివ్వదు - అతి వేగంగా పంపిణీ జరిగే పద్ధతులు ఆలోచిస్తుంది - అమలు పరుస్తుంది)

## ..... 19

"ఈ శతాబ్ది డెబ్భయిలలో మధ్య ప్రాచ్యంలోని ఆయిల్ ఉత్పత్తిదారులు అమ్మకం ధరను 300 నుండి 600 శాతం దాకా పెంచడంతో 'ఎనర్జీ పొదుపు' అనేది. ప్రపంచ వ్యాప్తమగు సమస్య అయింది. పారిశ్రామిక ఉత్ప త్తికి, ఎనర్జీ వినియోగానికి గల నిష్పత్తి ద్వారా ఈ పొదుపు నిర్ణయ మవుతుంది. జపాన్, అమెరికా, బ్రిటన్, యూరోపియన్ దేశాలూ పారి శ్రామిక రంగంలోని ఎనర్జీ వాడకానికి నియమాలు విధించి, 4 నుంచి 31 శాతం దాకా పొదుపు సాధించడం, వరల్డ్ బాంక్ లెఖ్ఖలద్వారా మనకి స్పష్టంగా తెలుస్తున్నది .... విద్యు చ్ఛక్తి సరఫరా నష్టం (ట్రాన్స్‌మిషన్ లాస్) ప్రపంచంలో ఎక్కడా ఒకటి న్నర శాతానికి మించి వుండదు- కాని, మనదేశంలో 21 శాతం... ప్రపంచ మంతటా విద్యుత్ వినియోగంలో 20

శాతం పొదుపు సాధించగలిగితే, మనం అతికష్టం మీద పాయింట్ ఆరు ఏడు శాతం (.67%) చూపగలుగు తున్నాం.... నాగరిక ప్రపంచంలో 'పవర్ కట్' అనేది ఎక్కడాలేదు - ఒక్క మనదేశంలో తప్ప!.... ఎలక్ట్రిసిటీ బోర్డులకి నష్టం ఎలా వస్తుంది - రాజకీయాల పక్కదారులతో రాయితీలు కల్పించబూనుకుంటే తప్ప!.... పవర్‌కట్ వుండే రాష్ట్రాలలో కొత్త పరిశ్రమలు ఎందుకు స్థాపించాలి? పబ్లిక్ సెక్టార్ అనగానే ఎందుకు నష్టాలు వస్తున్నాయి? పనివారికీ యాజమాన్యానికీ మధ్య సదవగహన వున్నప్పుడు, ఈ ఫాక్టరీలో తామూ ఒక భాగమనే మనో విశ్వాసం కార్మిక వర్గానికి కలిగినప్పుడు, లాభాలు ఎందుకు రావు?.... ఇండియా పిస్టన్స్, హిందూస్థాన్ ఫొటో ఫిలిమ్ వంటివి నాకు స్వీయానుభవంలోనివి. సాలీనా అయిదుకోట్లు లాభం గడించే హిందూస్థాన్ ఫోటో ఫిలిమ్ ముప్పయ్యయిదు కోట్లు గడిస్తోంది.... కాగితం, సిమెంట్, టెక్స్‌టయిల్స్ ఫెర్టిలైజర్స్ - యిటువంటి భారీపరిశ్రమలలో 50 లక్షల యూనిట్లకు పైగా వాడే ప్రతి ఒక్కరికీ 'యూనిట్ - ఆడిట్' ఏర్పడితే తప్ప మనదేశంలో ఎనర్జీ పొదుపు సాధించలేము.... రోజుకి 15 కోట్ల చొప్పున సంవత్సరానికి 5500 కోట్ల విలువగల ఎనర్జీని పొదుపుచేయగల అవకాశం మనకి వుంది. అయితే, ఆయా పరిశ్రమల నిర్వాహకులు సాంకేతిక పరంగా సహకరించాలి. బ్యాంకులు అప్పులిస్తున్నంత కాలం, రాజకీయ నాయకులు వేలు పెడుతున్నంతకాలం, మనపారిశ్రామిక ఆరోగ్యం బాగుపడదు దేశ సంపద వృద్ధిగాదు.... నేను ఆశావాదిని - రానున్న పదేళ్లలో ఎన్నో మార్పులు జరుగనున్నాయి"-అన్నారు మేనేజిమెంట్ కన్సల్టెంట్ యమ్.కె రాజు. స్లయిడ్స్‌తో సోదాహరణంగా ఆయన చెప్పిన విశేషాలు, మద్రాసు ప్రెస్ క్లబ్‌లో కూచున్న పాతిక మందినీ విస్మయపరిచాయి. ఇటువంటి అనుభవజ్ఞుల మాటలు వింటూంటే, మనకు తెలిసినది ఎంత స్వల్పమో బోధపడుతుంది....ప్రెస్‌క్లబ్ అధ్యక్షులు ఆంజనేయులు స్వాగతం చెప్పారు; కార్యదర్శి శౌరి వందన సమర్పణ గావించారు.

..... 26

'అభిమన్యు' దర్శకత్వంలో కపిలదేవ్ హీరోగా, ముచ్చెర్ల అరుణ హీరోయిన్‌గా, అక్టోబరు నెలాఖారు లోపల రెండు షెడ్యూల్స్‌లో పూర్తిగానున్న 'ధర్మరక్షణ'కి యివ్వాళ ముహూర్తం. దర్శకులు కెయస్ రెడ్డి, తన శిష్యుడైన 'అభిమన్యు'ని ఆశీర్వదించారు. నాలుగు పాటలు వుండే ఈ చిత్రంలో గొల్లపూడి, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, పి ఆర్ వరలక్ష్మి మున్నగువారున్నారు. కపిల్‌దేవ్ ప్రస్తుతం ఎనిమిది హిందీ సినిమాలలో నటిస్తున్నారు. మళయాళంలో 'జంగిల్ బాయ్,' తమిళంలో 'సంగపుష్పంగళ్' విడుదలవనున్నాయి.

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!




# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి



త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.

## 25

"ఏదో యాక్ట్ చేస్తున్నాను— డబ్బు సంపాదిస్తున్నాను— పేరు ప్రతిష్టలు వస్తున్నాయి. కాని, నాకెందుకనో అసంతృప్తిగానే ఉంటోంది. ఈ ఫైట్స్యూ ఈ రొమాన్సూ, ఈ కంగ్రాట్స్యూ యిదంతా కృతకంగా తోస్తోంది. 'ఇదే నా. నీవు చేయగలిగింది ? అని నాలోని కళాకారుడు నన్ను అరాటపెడుతున్నాడు. నాకు సంతృప్తి కలిగించే పాత్ర ఎప్పటికొస్తుందో— అసలు వస్తుందో రాదో" — అంటూ మనసులోని మాట, కళాకారునిలో వుండే సహజమైన అశాంతితో వ్యక్తం చేశారు భానూ చందర్. పామ్‌గ్రోవ్‌లోని 'ముద్దుల మనవడు' (రోజా ఆర్ట్ ఫిలింస్ — నిర్మాత : శివరామరాజు) ప్రెస్ మీట్ సందర్భంగా. జంధ్యాల సంభాషణలు. మోహన్‌గాంధీ దర్శకత్వం, చక్రవర్తి సంగీతం. శోభన కథానాయిక. మీరిది చదివేనాటికి పిక్చర్ రిలీజై వుండవచ్చు.

## . . . . . 28

"స్వచ్ఛంద సేవా సంస్థలు మన సమాజంలోని అనేకానేక సమస్యల పరిష్కారానికి పూనుకోవాలి. సేవా కార్యక్రమాలకు ప్రభుత్వం డబ్బు కేటాయించగలదే తప్ప, వాటి సక్రమ నిర్వహణకు సేవా సంస్థలూ, సేవా చింతన గల ఉదారమనస్కులూ పూనుకోవాలి. ప్రజల సహకారం లేనిదే ఏదీ విజయవంతం కాదు. సంఘం బాగుపడితేనే రాష్ట్రమూ, రాష్ట్రం బాగుపడితేనే ప్రభుత్వమూ - యిలా ఒకదానితో ఒకటి ముడివడి వున్నాయి. జాతీయ సంక్షేమానికి బాధ్యతాయుతమైన సన్మార్గ వర్తన ఎంతో అవసరం. ఆ సన్మార్గాభిలాష నుంచే, సాంఘిక సమస్యలు కొంతమేర పరిష్కారమై, ప్రజా శ్రేయస్సుకి దారితీస్తాయి" అన్నారు ఆంధ్రా గవర్నర్ కుముద్‌బెన్ జోషి, మైలాపూర్ అకాడమీ 34వ వార్షికోత్సవ సందర్భంగా. అకాడమీ ఉపాధ్యక్షురాలు సరోజినీ వరదప్పన్, గుజరాత్ సోదరి కుముద్‌బెన్ ప్రస్తుతం గవర్నరుగాని ఆమె ఆదినుంచీ అత్యుత్తమ సోషల్ వర్కర్ - అన్నారు వందన సమర్పణ గావిస్తూ. 'ధర్మాత్మ వైద్య సుబ్రహ్మణ్యయ్యర్' భవనానికి శంకుస్థాపన గావించారు జస్టిస్ మోహన్. సభా కార్యక్రమాన్ని, కార్యదర్శి వీరరాఘవన్ నిర్వహించారు. ప్రార్థన : చిత్రామహేష్. అధ్యక్షులు యస్వీ నరసింహం, ఆహూతులకు స్వాగతం తెలుపగా శివన్‌నాయర్ సావనిర్ విడుదల చేశారు. స్టేట్ బ్యాంక్ ఛీఫ్ జనరల్ మేనేజర్ మార్గబంధు, తమిళనాడు ప్రభుత్వపు ప్లానింగ్ సెక్రటరీ నారాయణన్, మద్రాసులోని సోవియట్ కాన్సల్ మొల్చినొవ్, 'హిందూ' పత్రిక జనరల్ మేనేజరు మురళి, కప్పా కంపెనీల డైరక్టరు కమలా పరశురామ్ మైలాపూర్ అకాడమీ వివిధ రంగాలలో చేస్తున్న స్వచ్ఛంద సేవను ప్రస్తుతించారు. ఈ అకాడమీ ద్వారా తమలోని సేవా

భావాన్ని వ్యక్తపరిచే విద్వత్ వరేణ్యులూ, మహానుభావులూ ఎందరెందరో వున్నారు.... సభానంతరం వేర్వేరు పోటీలలోని విజేతలకు బహుమతి ప్రదానం.

. . . . . 29

తెలంగి నరసింహారావు దర్శకత్వంలో 'మోహన్‌జీ - జగన్‌జీ' సోదరుల (రమాసినీ చిత్రాలయ) 'ఓ ఇంటి కాపురం' సెప్టెంబరులో రిలీజ్ కానున్న సందర్భంగా పామ్‌గ్రోవ్‌లో ప్రెస్ మీట్. చంద్రమోహన్ - భానుప్రియ, శరత్‌బాబు - రాజ్యలక్ష్మి ఈ చిత్రంలోని జంటలు. గుమ్మడి, సత్యనారాయణ, రావికొండ్రావు, మాడా మున్నగువారున్నారు. రమేష్ నాయుడు సంగీతం. కుటుంబం గాథాచిత్రం. పి ఆర్ ఓ : జగన్.

. . . . . 30

అయిదు వందల ఏళ్లనాటిది అన్నమాచార్య అచ్చతెలుగు ఉద్యమం. ఈ పదకవితాపితామహుడు 32 వేల కవితలు, 12 శతకాలు వ్రాశాడని ప్రతీతి. అందులో కొన్ని జీర్ణించిపోగా, అధిక భాగం వెలుగులోకి వచ్చాయి. తన కవితా ధారను నరాంకితంగాక పరమేశ్వరాంకితం గావించిన యశోధనుడాయన, త్యాగరాజు, రామదాసు, క్షేత్రయ్యలకు గానంలోను, కీర్తనంలోను, నాట్యంలోను మార్గదర్శకుడు. అటువంటి తాళ్లపాక అన్నమాచార్యుని సంకీర్తనలను, ముఖ్యంగా నలభై సంకీర్తనలను, అన్నమాచార్య ట్రస్ట్‌వారు (ట్రస్టీలు : వాస్తుశిల్పి బియన్‌రెడ్డి, దర్శకులు జంధ్యాల, నిర్మాత సీతాపద్మరాజు- మేనేజింగ్ ట్రస్టీ : బివివి కౌండిల్య) నాలుగు కాసెట్లులో సమర్పిస్తున్నారు. ఈ నాలుగు కాసెట్లూ, అన్నమాచార్య తిరుమలేశుల జ్ఞాపికలు, ముదిగొండ శివప్రసాద్ వ్రాసిన అన్నమయ్య చరిత్ర మున్నగు నన్నీ ఒక గిఫ్ట్ బాక్స్‌లో ఉంటాయి. బాక్స్ ఖరీదు రు 350/- ఈ గిఫ్ట్‌బాక్స్‌లు ఆంధ్రా బ్యాంక్, వైశ్యాబ్యాంక్, స్టేట్‌బ్యాంక్, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు వీటి ముఖ్య కార్యాలయాలలోను, బ్రాంచీలలోను లభ్యమవుతాయి. కాసెట్లకీ గిఫ్ట్ బాక్స్‌కీ అయిన ఖర్చు మాత్రమే (నూటఏభై రెండువందల మధ్య) ఆయా బ్యాంకులు ట్రస్ట్ కిస్తాయి- మిగతాది వారివదనే 'అన్నమాచార్య ట్రస్ట్' పేరిట నిలవ ధనంగా ఉంటుంది. ఒక లక్ష కాసెట్లు విక్రయించగలమనీ, రెండుకోట్ల మూలధనం సేకరించి తద్వారా ఆయన భావస్రవంతికి నవచైతన్యం చేకూర్చగలమనీ ఆశిస్తున్నారు. ఆ సువర్ణ స్వప్నం నెరవేరాలనీ, వారు తలబెట్టిన పథకాలు కార్యరూపం దాల్చి విజయవంతమవాలనీ అందరితోబాటు మేము మనసార కోరుకుంటున్నాము. ఇంతకీ ఆ కాసెట్లలో అన్నమాచార్య సంకీర్తనలు పాడిన దెవరెవరో చెప్పలేదు. ప్రఖ్యాత మ్యూజిక్ డైరక్టర్ రమేష్ నాయుడు స్వరకల్పనలో: బాలమురళీకృష్ణ, ఆషా బొన్‌స్లే, జేసుదాస్, సుశీల, బాల

సుబ్రహ్మణ్యం, వాణీజయరామ్, వేదవతీ ప్రభాకర్, పూర్ణచంద్ర, శైలజ మున్నగువారు .... సవేరా కాన్ఫరెన్స్ హాలులో జరిగిన ఈ సమావేశానికి బియన్ రెడ్డి అధ్యక్షత వహించారు. మాస్టర్ టేప్సని రమేష్‌నాయుడు లాంఛన ప్రాయంగా 'అన్నమాచార్య ట్రస్ట్'కి ఆంధ్రాబ్యాంక్ జనరల్ మేనేజరు బి శ్రీనివాసరావు ద్వారా అందజేశారు. అశ్వని మార్కెటింగ్ అండ్ డిస్ట్రిబ్యూటింగ్ ఏజన్సీస్ (ఆర్ లక్ష్మయ్య పటేల్) ద్వారా ఈ కాసెట్లు మార్కెట్‌లోకి వస్తాయి. స్వాగతమూ, సభానిర్వహణ శాండిల్య : అంతేకాదు, ఈ కార్యభారమంతా ఆయనదే! సంగీత స్రష్టలను భాషా సంకుచితత్వాల మధ్య కట్టివేయకండి - అని బాలమురళి చేసిన హెచ్చరికకు, ప్రత్యక్ష నిదర్శన మనిపించాయి ఆషా భోన్స్లె పాడిన అయిదు సంకీర్తనలూ. వింటూంటే - పలుకుతేనేలే ఆమె కంఠం నుంచి జాలువారాయి. దైవ కార్యానికి డబ్బు పుచ్చుకుంటానా? - అని, పైసా తీసుకోకుండా పాడారు ఆమె ఈ అయిదు పాటలూ. ఉదయం రికార్డింగ్‌కి కూచుని, రాత్రి ఏడుంముప్పావు దాకా ఏక బిగిని, ప్రతిపాటా తనకి ఆత్మ సంతుష్టి కలిగేదాకా 'ఒకె' చేయకుండా పాడారు. రమేష్ నాయుడు 'బావుంది' అని అన్నా, తనకి తృప్తి కలిగేదాకా, తర్వాత కీర్తనకి వెళ్లేవారు కాదట. ట్రస్ట్‌వారు బాలమురళి రమేష్ నాయుడు, ఆషా భోన్స్లెలని సత్కరించారు. దాక్షిణాత్య లతామంగేష్కర్ సుశీల, సోదరి ఆషాకు పట్టువీరె పెట్టారు .... తను కడప జిల్లా కలెక్టరుగా వున్నప్పటి తాళ్లపాక జ్ఞాపకాలు చెప్పారు చంద్రమౌళి (ప్రస్తుతం ఆంధ్రా గవర్నరుకి పి ఎ) .... 'అన్నమాచార్య' చిత్రం అందరినీ మెప్పించ గలిగితే నేను ధన్యుణ్ణి' - అన్నారు జంధ్యాల .... అన్నమయ్య పదకవితలలోని భావసౌగంధికాలూ, స్వర మాధురులూ నుంచి బయటకొచ్చేసరికి పదకొండయింది.

## 1987 సెప్టెంబరు 05

పవన్ వారి 'శ్రీమతి ఒక బహుమతి' పాటల కాసెట్ రిలీజ్ సవేరాలో, తయారు చేసినవారు: సుధా కాసెట్స్. మార్కెటింగ్: కావేరి కాసెట్స్ (శ్రీరామచంద్ర మూర్తి) .... సభా కార్యక్రమం నిర్వహించిన గీతా సుబ్బారావు వచ్చిన జర్నలిస్ట్‌స్ అందరి పేర్లూ స్లిప్స్ మీద రాసి, వాటిని రోల్ చేసి, ఒక జార్‌లో వేసి ఎవరి పేరున్న చీటీ వస్తే, వారు ఈనాటి సభకి ముఖ్యఅతిథి అన్నారు. జయసుధ చేత స్లిప్స్ తీయించారు. 'శివరంజని'లో పనిచేసే నాగేశ్వరరావు పేరు వచ్చింది. యాదృచ్ఛికమే. అయినా, సమయస్ఫూర్తితో సుబ్బారావు జోక్ విసిరారు. జయసుధతోబాటు అందరూ నవ్వారు. .... కలం కృషీవలు రెప్పుడూ తన కెంతో చేయూత నిస్తున్నారని సిరివెన్నెల సీతారామశాస్త్రి, ఒక విశ్వనాథ్ దృశ్య ప్రధానంగాను మరొక విశ్వనాథ్ ('విసు') డైలాగ్ ప్రధానం

గాను చిత్రీకరణ గావిస్తారని అకెళ్ల అన్నారు. 'శ్రీమతి ఒక బహుమతి'కి ఒకరు పాటలూ మరొకరు సంభాష ణలు సమకూర్చారు. జయసుధ-నరేష్, కల్పన-తులసీరామ్ ఈ చిత్రం లోని ప్రధాన జంటలు. దర్శకత్వం: విసు .... లక్ష్మీ రాజ్యం శ్రీధరరావు దంపతులు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్‌కి అయిదు వేలు విరాళ మిచ్చారు; అలాగే పవన్ వారు చెయ్యెన్నాట పదహార్లు యిచ్చారు. 'నర్తనశాల' విజయం సందర్భంగా 1963లో మాకు మొట్టమొదట పార్టీ యిచ్చి గౌరవించినది తెలుగుజర్నలిస్టు లేనని తెలిపారు శ్రీధరరావు - గడిచిన స్మృతుల ఆనందాతిరేకంతో. రాను రాను మర్చిపోయే వారి సంఖ్య, మొహం చాటేసేవారి సంఖ్య అధికమ వుతున్న ఈ రోజులలో, ఇరవై నాలు గేళ్ల క్రితం తెలుగు జర్నలిస్టులు పాత వుడ్‌లాండ్స్‌లో యిచ్చిన చిన్న టీ పార్టీని గుర్తుంచుకోవడం గొప్ప విష యం ("మీరూ వున్నారు ఆ రోజున" - అన్నారు లక్ష్మీరాజ్యం మీటింగ యక... "అవును. జ్ఞాపకంవుంది 'నర్తన శాల' పిక్చరయాక" అన్నాను.... అనాటి జర్నలిజమ్ తీరు వేరు) .... నిర్మాత కరుణాకర్ పాత్రికేయులకు ధన్యవాదాలు తెలుపుతూ, 'శ్రీమతి ఒక బహుమతి' అక్టోబరులో విడుదల వుతుందని చెప్పారు.

—యన్నార్ చందూర్

నన్నడిగితే సంభాషణా పరుల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. ఎదుటవారు చెబుతున్నదిశ్రద్ధగా వినే వారు ఒక రకం; వారు అలా చెబుతూ వుండగా, తాము విసరదలుచుకున్న ఛలోక్తి గురించి ఆలోచించే వారు మరొకరకం. —బిల్విన్

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీ కారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P. B. 2922, Madras-4

# సమీక్షలు చిత్రజగ్గా

## సచ్చిదానందవారి 'కులాల కురుక్షేత్రం'

శాస్త్రి (నరేష్), రెడ్డి (దగ్గుపాటి రాజా), చౌదరి (శుభలేఖ సుధాకర్) ముగ్గురూ కాలేజీ మేట్స్, రూమ్ మేట్సును. సత్యం, శివమ్, సుందరమ్ అవుతారు ఉత్తరోత్తరా. అరుణ (అర్చనా) మంత్రిగారి (రంగనాథ్) కూతురైనప్పటికీ, నలుగురితో బాటు బస్సులో వెళ్తాననే స్వతంత్ర భావ కురాలు - పై ముగ్గురి క్లాస్‌మేటు. అవకతవకలూ అల్లరి చిల్లర చేష్టలూ లేని సహజమైత్రి నలుగురిదీను. లెక్చరర్ పోస్టుకి తన అర్హతలు తప్ప, కుల మెందుకు చెప్పాలని ధిక్కరించిన చైతన్య, కోర్టుకి వెళ్ళి, న్యాయమూర్తిని (సి యస్ రావు) ఒప్పించి, కేసు నెగ్గి, లెక్చరరుగా చేరుతాడు. అంతవరకూ శాస్త్రి, అరుణని తన స్వప్నసీమలోని దేవత అనుకుంటాడు. అయితే అరుణ చైతన్యపై మనస్సు నిలుపుతుంది - అతనిని పెళ్లి చేసుకునేందుకు నిశ్చయించుకుంటుంది. మిత్రులు ముగ్గురూ ఆమెని అభినందిస్తారు - అండగా నిలుస్తారు. కాని, మంత్రిగారికి తలవంపు. అంచేత, పెళ్లిపీటలమీదున్న చైతన్యని కిరాయి రౌడీల చేత పొడిపిస్తాడు - అధికార పీఠానికి అపేక్షలు వుండవని అరుణ అప్పటికే తెలుసుకుంది. చైతన్య గుండెనెత్తురుతో వెలిగిన జ్యోతి, ఈ నలుగురినీ ఒక ఆశయానికి కట్టేయడమే గాకుండా, మహదేవశాస్త్రి (జె వి సోమయాజులు) కూతురుకి (చిత్ర) నిర్భయంగా రెడ్డిని పెళ్లి చేసుకోగల ధైర్యమిస్తుంది; చౌదరికి హరిజన యువతిని చేబట్టగల సాహసమిస్తుంది. ప్రజలని కులం పేరుతో చీల్చి, తన కుర్చీ కాపాడుకొనే మంత్రిగారూ, ప్రజలని మౌఢ్యంలో ఉంచేందుకు వారికి తెలియని దేవభాషలో ఆర్భాటంచేసే ఆకాశదూత (కోట శ్రీనివాసరావు), అరుణ చేతిలో హతులవుతారు. యువతని బాధ్యతాయుతులుగా చిత్రించడం మెచ్చుకోదగ్గ విషయం. సముచిత ప్రశ్నలతో తండ్రి హృదయ కవాటం తెరిచిన బ్రాహ్మణ కన్యగా, చిత్ర తన పాత్ర నొక సౌందర్య దీపం చేసింది; అలాగే కాటికాపరి వేలు గావించిన నారాయణ మంత్రోచ్చారణ విస్మయం గొల్పుతుంది. దేవుని ఊరేగింపు మొదటి ఏ వీధిలోనుంచి వెళ్లాలనేది యిప్పటికీ మన గ్రామాల్లో వున్న ప్రశ్నే. దర్శకులు:

శరత్. ఇంత చక్కటి చిత్రం రూపొం దించిన నిర్మాత లక్ష్మీదాసు అభినం దనీయులు.

## సంయుక్తావారి 'విజేత విక్రమ్'

చిన్నప్పుడెప్పుడో చదివాను బెర్నార్డ్ షా చెప్పినది: హీరో విలన్‌ని చావమోదడంగాక, కానిస్టేబుల్ని పిలిచి ట్లానికి వొప్పగించిన నాడే హాలి వుడ్‌కి సభ్యతా సంస్కారాలు అలవడ్డా యని అనుకోవచ్చు. అంతదాకా ఆ సినిమాలు చూడటం వొటి దండగ — అన్నాడాయన. ఆ బెర్నార్డ్ షా రాసిన 'పిగ్మాలియనే' – ('మై ఫెయిర్ లేడీ') ఆయన ఆ మాటలు చెప్పిన నలభై ఏభై ఏళ్లకు, సినిమా తెరకెక్కించారు; కనక వర్షం కురిసింది. ప్రస్తుతం మన తెలుగు సినిమా 'హీరో ఇమేజ్'ని పెంచే కృషిలో నిమగ్నమై, ఆ హీరో పది మందిని చిత్తుగా చావగొట్టడం చూపుతోంది. అదే ధీర నాయకుని లక్షణమని వారి అభిప్రాయం. చిన్న పిల్లలు చప్పట్లు కొట్టవచ్చు, అభిమాన సంఘాలు జేజేలు పలకవచ్చు. కాని, ఆ కెమెరా ట్రిక్కులు నటన అని పించుకుంటాయా? ఈ పిక్చర్లోని విక్రమ్ (వెంకటేష్), ఫిడేలు చేత బుచ్చుకు, వింత వస్తువులతో గూడు లేని గుర్రపు బండీలో ఆ ఊరొచ్చి, వీర విహారం ప్రారంభించి, శ్రేష్టమైన కలపతో ఉత్తర దిశగా ఒక కాటేజీ కట్టించుకు, విలన్ (రావు గోపాల రావు) కూతురునీ (ఫరా), పుణుకులు చిల్లుగారెలు అమ్మే యువతి చెల్లెల్నీ (పూర్ణిమ) ఆకట్టుకు, సంబరాల వేళ వారితో జానపద నృత్యం చేస్తాడు. పూర్ణిమ పాత్ర అంటే, ఆమె భంగ పడటం బలి అవటం ప్రేక్షకులు ఆశించేవరవడి గనక, అదే జరుగు తుంది యిందులోనూ. నాయికా నాయకుల జుగుప్సాకర కదలికలు, నత్తివాని నోట పలికించిన 'పు' శబ్దమూ, 'చి' శబ్దమూ సభ్యసమా జానికి అభ్యంతరకరమని అనిపించక మానవు. ప్రేక్షకాభిరుచులు నానాటికి మలిన మవుతున్నాయి. 'విజేత విక్రమ్' వెంకటేష్ హీరో యిమేజ్‌ని పెంచేందుకు తీసిన ఫార్ములా చిత్ర మా? — అనిపిస్తుంది. దర్శకులు: రవిచంద్ర. నిర్మాత: నరసారెడ్డి: సమర్పణ: తిరుపతి రెడ్డి.

## రాధామాధవ వారి 'గౌతమి'

స్రవంతి, సింధు భైరవి, సిరివెన్నెల తర్వాత సుహాసిని నటించిన ఏ చిత్ర మైనా, వాటితో పోల్చకుండా వుండ లేము. 'గౌతమి'లో కూడ ఆమె నటన రమణీయంగా, రాగ రంజితంగా లేక పోలేదు. అయితే, ప్లాస్టిక్ సర్జరీ అనం తరం, శాంతాదేవి (షావుకారు జానకి) కుమారుడే ఈ డాక్టర్ సాగర్ (శరత్ బాబు) అని తెలుసుకున్న మీదట, తనకు ప్రాణదానం చేసిన వ్యక్తి మీద కించిత్తు కూడా కృతజ్ఞతాభావం

లేకుండా, 'క్షమయా ధరిత్రి' అని అతను హెచ్చరిస్తున్నప్పటికీ, క్రోధావేశంతో ప్రతీకార చర్యగా నయవంచకుడైన విలన్‌ని (భర్త) కాల్చేయడం సమంజసంగా తోచదు. 'బుష్' వారి బ్యూటీ క్వీన్‌గా ఎన్నికవడం వరకూ బావుంది. ప్రాణాధికంగా చూసుకుంటున్న డాక్టర్ సాగర్ రక్షణ వొదిలి, పులిబోనులోకి ఎందుకు ప్రవేశించినట్లు? నర్మదగా ఆడిన నాటకమంతా నమ్మశక్యం గానిదిగా ఉంది. తను బతికివున్నట్టుగా తెలిపి, తన కారణంగా యిచ్చిన ఆస్తిని రాబట్టుకు, ఆ దుర్మార్గుని బికారిగాచేసి, జైలుకి పంపవచ్చుకదా-తనచేతులతో తను కాల్చి, మగవారి దౌష్ట్యం గురించి మహోపన్యాసం యిచ్చే బదులు, ప్రాణం పోసిన వ్యక్తికి తన కథ చెప్పి, అతనికి మనశ్శాంతి కలిగించి ప్రత్యుపకారం పొందవచ్చు కదా! నెచ్చెలులతో ఉయ్యాల వూగుతూ సలసల కారే నూనెలో పడటమేమిటి? ఇలాటి సందేహాలెన్నో సామాన్యునికి వస్తాయి. అయితే, గౌతమీ తీరమూ, ఆ కుగ్రామమూ, ఆలయమూ అందులోని పూజారి, స్వంత ఊరులోని దేవాలయానికి 108 ప్రదక్షిణాలు చేయాలని శాంతాదేవి రావడం, సుహాసిని నటనా చాతుర్యం, సోమయాజులు పెర్‌ఫార మెన్స్‌లోని నిండుతనం, ఝాన్సీరాణి లాంటి ప్రయాణం యిత్యాదులు ఈ చిత్రానికి పుష్టినిస్తున్నాయి. దర్శకులు: క్రాంతికుమార్. నిర్మాత: మండవ గోపాలకృష్ణ.

## రాక్‌గోపాల్ వారి
## 'మన్మధలీల కామరాజుగోల'

హీరో కామరాజుకి (రాజేంద్ర ప్రసాద్) తప్ప మరెవరికీ కనిపించని మన్మథుడు (చంద్రమోహన్) ఆడించే మహానాటక మిదంతా! చిరాకుపడే కల్పనలో (కల్పన) వలపు రగిల్చి, అక్కడితో తనపని అయిపోయినట్టుగా ఆమె జోలికి పోక, కథ అడ్డం తిరిగి విడాకుల కోసం కోర్టుకెళ్లే ప్రమాదం ఏర్పడగానే, బొమ్మ (నిర్మల) అవతారం ఎత్తి, ఆమెకి వూరట కలిగిస్తాడు. ఇక, కామరాజుతోనంటే, పందెం కట్టి అతన్ని కాళ్ల బేరానికి తీసుకువస్తాడు. చుక్కలతోప్రారంభమై, పందాలతోసాగే ఈ చిత్రంలో, ఫానుల కంపెనీ మేనేజరు (నూతన్ ప్రసాద్) తన కూతురు 'ముష్టి ప్రేమ' (అభిమాన రచయిత్రి నవల పేరది - ఈమె ముష్టివాడినే ప్రేమించి పెళ్లి చేసుకోనేందుకు తీర్మానించుకుంటుంది.) ప్రాణాంతకంగా పరిణమిస్తుందని అనుకోడు. కాని అదృష్టవశాత్తూ ఆ 'అబ్బి' తన దగ్గిర పనిచేసే అంజిబాబు (శుభలేఖ సుధాకర్) అవడంతో బతుకు జీవుడా అని తెప్పరిల్లుతాడు. సందేహాలరావు, అతని యజమాని (వేలు - వీరభద్రం) పందెం కాసి మనని నవ్విస్తారు. 'ముష్టి ప్రేమ' నాయిక నవల చెప్పజెబుతూ మనని నవ్విస్తుంది. నిలువెత్తు నవ్వులలో ముంచెత్తే ఈ చిత్రానికి దర్శకులు: రేలంగి

నరసింహారావు. నిర్మాతలు : యమ్మెస్ ప్రసాద్, రామకోటీశ్వరరావు: సమర్పణ: యలమంచిలి రామచంద్రరావు.

## 'మిషన్'

## (The Mission)

వార్నర్ బ్రదర్స్ వారి 25 మిలియన్ డాలర్ల 70 యమ్మెమ్ పిక్చర్, టాజ్ ఫిలిమ్స్‌ద్వారా విడుదలవుతోంది -'సెల్వ వినాయగర్' దీనికి ప్రమోటర్స్ .... 1756లో గాబ్రియల్ అనే క్రైస్తవ మతగురువు దక్షిణ అమెరికాలోని ఒకానొక, ప్రాచీన తెగ (రెడ్ ఇండియన్స్) వద్దకు వెళ్ళి, వారిలోని అపనమ్మకం పోగొట్టి, ప్రభు భక్తి కలిగింపజేస్తాడు. అపనమ్మకం ఎందుకంటే, ఈ శ్వేతవర్ణులు, తమని వేటాడేందుకు తప్ప ఈ కీకారణ్యాలలోకి రారు. వారిని అవిధంగా వేటాడి స్పానిష్ గవర్నరుకి అమ్మే మెండొాజా, తొందరబాటులో తన సోదరుని తనే స్వయంగా చంపి, పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, గాబ్రియల్ బోధతో మతగురువుగా మారుతాడు. యూరప్‌లోని స్పెయిన్, పోర్చుగల్ దేశాలు చేసుకున్న వొప్పందం (ట్రీటీ అఫ్ మాడ్రిడ్) ప్రకారం, క్రైస్తవమత పీఠాధిపతి, పోర్చుగల్‌ది అనుకొని తమ అధీనంలో వుంచుకొన్న దక్షిణ అమెరికా భూభాగాన్ని కొంత, బానిస వ్యాపారం బాహాటంగా చేసే స్పెయిన్‌కి వొప్పగించాల్సి వస్తుంది. గాబ్రియల్, మెండోజాల విన్నపాలు అరణ్యరోదన అవుతాయి. రాజరికానికీ, మతపీఠానికీ గల స్పర్ధలో, రాజరికం ఎంత నిర్దాక్షిణ్యంగా రక్తం చిందించేదీ హృదయ విదారకంగా చూపుతుంది ఈ క్లాసిక్.

## అరుణోదయావారి

## 'ఊపిరిపోయండి'

స్వతంత్రం అనే మాట ఫ్రీడమ్‌కి (Freedom), స్వాతంత్ర్యం అనే మాట ఇండిపెండెన్స్‌కి (Independence) వాడుతాము 'ఫ్రీడమ్ యట్ మిడ్‌నైట్' ('Freedom at Midnight') అనే పుస్తకం పేరులోని ఫ్రీడమ్‌కి 'బంధ విముక్తి' అని అర్థం. సౌత్ఇండియన్ ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లోని విద్యార్థులు యిందులోని నటులు – పన్నెండేళ్ల తెర మరుగు తర్వాత యువి బాబు దర్శకత్వం వహించిన చిత్రమిది. ఔత్సాహికులకు తోడుగా చంద్రమోహన్, సిల్క్ స్మిత, వైవిజయ ఉన్నారు. బండకాశీగా మూగివానిపాత్ర చంద్రమోహన్‌ది. తోలుబొమ్మలాట తరుణి సిల్క్‌స్మిత - ఈమె మనసు మూగివాని ప్రేమకు అంకితమైపోయి వుంటుంది. యుద్ధరంగంనుంచి తిరిగివస్తున్న వీరజవాన్‌ని రైలులో నుంచి తోసేసి, గుండెలు తీసిన బంటులా వారింటికి వచ్చి, అతని చెల్లెల్ని పెళ్లాడి, యావదాస్తి కబళించి దొంగవ్యాపారాలతో కోటీశ్వరుడై, కుంటివానిగా తిరిగొచ్చిన వీరజవాన్ చేతుల్లోగాక, మూగివాని కబంధ హస్తాలలో మరణిస్తాడు విలన్. మొత్తం పిక్చర్ని చంద్రమోహన్



# సాహిత్య అకాడెమీ

## ఇటీవల వెలువడిన ప్రచురణలు

| | వెల |
|---|---|
| ☐ మట్టి దీపం (తమిళ నవల) — ఎమ్. వరదరాజన్ | రూ. 25 - 00 |
| ☐ మరాఠి కథా సంగ్రహము — సం. ఎ. కె. - భగవత్ | రూ. 15 - 00 |
| ☐ కావ్యమాల (స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత) — సం. దేవులపల్లి రామానుజరావు | రూ. 25 - 00 |
| ☐ తెలుగు కావ్యమాల — సం. కాటూరి వెంకటేశ్వరరావు | రూ. 30 - 00 |
| ☐ తమిళ వాఙ్మయ చరిత్రము — ఎం. వరదరాజన్ | రూ. 25 – 00 |
| ☐ తలపుల దుమారము (2వ ప్రచురణ) — మౌలానా అబుల్‌కలాం ఆజాద్ | రూ. 15 - 00 |

## "భారతీయ సాహిత్య నిర్మాతలు"

(ఒక్కొక్క ప్రతి వెల రూ. 4/=)

☐ భారతి ☐ భారతేందు హరిశ్చంద్ర ☐ బుద్ధదేవబోస్ ☐ జ్ఞానదేవుడు ☐ కల్హణుడు ☐ గురజాడ ☐ మహాకవి ఉళ్లూర్ ☐ మాణిక్యవాచగర్ ☐ నామదేవుడు ☐ నర్మదా శంకర్ ☐ నజీర్ అక్బరాబాది ☐ పంజె మంగేశ రావ్ ☐ పోతన ☐ రాహుల్ సాంకృత్యాయన్ ☐ సరళదాసు ☐ తుకారామ్ ☐ వీరేశలింగం ☐ విద్యాపతి

(ఒక్కొక్క ప్రతి వెల రూ. 5/-)

☐ డా॥ సి. ఆర్. రెడ్డి ☐ దత్తకవి ☐ భవభూతి ☐ శ్రీ అరవిందులు

వివరాలకు వ్రాయండి:

**సాహిత్య అకాడెమీ**

దక్షిణ ప్రాంతీయ కార్యాలయం

29, ఎల్డామ్స్ రోడ్డు, మదరాసు - 600 018 (దూరవాణి - 454088)

సాహిత్య అకాడెమీ

బొంబాయి – క్రొత్తఢిల్లీ - మదరాసు - కలకత్తా



సాయం పడతాడు- షూటింగ్‌లో ఆయన పాల్గొన్నది మూడున్నర రోజులే అయినప్పటికీ! ఎత్తుగడ చక్కగా వుందిగాని నడకంతా ఫార్ములాయే! న్యాయవిధేయతే పరీక్షణకు ఊపిరి పోసేది — రక్తసిక్త ప్రతీకారం కాదు. అయితే వక్రభాష్యానికే సినీప్రేక్షకుల హర్షామోదాలు.

## అన్నపూర్ణావారి 'అగ్నిపుత్రుడు'

పది పన్నెండురోజుల క్రితం 'ప్రసాద్ 70 యమ్మెమ్' లో ఒక రీలు చూపినప్పుడు, యజ్ఞోపవీత విసర్జనపై తండ్రీ కొడుకుల వాగ్వివాదం, ఆ నాటకీయత, హింసామార్గం అవలంబించే కొడుకు ఇంటిగడప దాటి వెళ్లడం ఉచితమని భావించిన భరద్వాజ (నాగేశ్వర్రావు) మత విశ్వాసం, భూపతి (సత్యనారాయణ) మనుషులు పేదల ధాన్యపు బళ్లను దోచుకోవడం, చైతన్య (నాగార్జున) ఆ గిరిజనులకు మనోబలం కలిగించడం - యిలాటివి చూసి, యిది సంచలనాత్మక చిత్రం కాగలదని అనుకున్నాం. అయితే, 'మీనా'లో ప్రివ్యూ చూసినమీదట, చిత్ర నిర్మాణానికి ('సింహాసనం' తర్వాత రెండవ 70 యమ్మెమ్ చిత్రం తెలుగులో) ధనరాసులు కుమ్మరించారే తప్ప, ఏం చెప్పదలుచుకున్నారో, చెబుతున్నవారికే స్పష్టంగా తెలియదనిపించింది. ఉగ్రవాదమూ, అసలు చైతన్య (శివాజీగణేశన్) ఉరికంబమెక్కపేపు వుంపటుంజేసి. యిది నక్సలైట్ ఉద్యమం తర్వాత జరిగిన కథగా మనం భావించవలసి వుంటుంది. అయితే, పీఠాధిపతి భరద్వాజ, తెలంగాణా, రాయలసీమ, సర్కారు జిల్లాలు, ఉత్తరాంధ్ర - ఈ నాలుగింటిలో ఏ ప్రాంతానికి చెందినవాడు? ఎకరానికి ముప్పాయి బస్తాలు పండే భూమిని,

ఎన్ని బస్తాలకు నేలాని ఖరారు చేయగల పీఠం ఏదైనా వున్నదా? ఆదిత్య స్తోత్రంతో నేత్రోత్సవంగా శ్రవణానందదాయకంగా ప్రారంభమై మధ్యలో ఈ సద్బ్రాహ్మల సంధ్యా వందనం ఎక్కడా కనబడకపోయినా, చుక్కల్లో చంద్రునిలా, పాతిక ముప్ఫయిమంది కాలేజీ పిల్లలతో హీరోగారు (నాగార్జున) డాన్సు మొదలుపెట్టేసరికి, 'ఇతనా, భరద్వాజ కలలు గంటున్న హైందవ ధర్మ పరిరక్షకుడు?' అనే నిస్పృహ కలుగుతుంది. ఆ తర్వాత అంతా ఫార్ములాయే; వాస్తవికత లేదు; స్వాభావిక న్యాయం లేదు. నాగేశ్వరరావు నాగార్జున్‌ని 'అగ్నిపుత్రుని'గా ఆశీర్వదించడంతో చిత్రం ముగుస్తుంది. దర్శకులు: కె. రాఘవేంద్రరావు; నిర్మాత : వెంకట్ అక్కినేని.

## పూర్ణోదయావారి 'స్వయం కృషి'

చెట్టు కింద చెప్పులు కుట్టుకొనే సాంబయ్య (చిరంజీవి), చెట్టుకొమ్మకి వేలాడదీసిన వుయ్యాలలో ఒక

పసివాడు, కనుచూపు మేర దేవాలయం వద్ద చెప్పులు ఆయా గూళ్ళలో జాగర్త చేసి పదో, పాతికో పైసలు పుచ్చుకొనే గంగ (విజయశాంతి) - వీరితో ప్రారంభమవుతుంది. రేడియోలో హిందీ పాటాలు వింటూ తన భాషా జ్ఞానాన్ని, లోకజ్ఞానాన్ని వృద్ధిపరుచుకో జూస్తాడు సాంబయ్య. వుయ్యాలలోని పసివాడెవరయ్యా అంటే, అతని చెల్లెలు కొడుకు - ఆమె చనిపోయింది; బావ మరిది గోవిందు తాగుబోతు, పరమ దుర్మార్గుడు. 'అట్లా సూడమాకయ్యా' అంటూ వలపులు కురిపించే గంగ, సాంబయ్య నెలాగైనా సరే కట్టుకోవా లని, ట్యూబెక్టమీ చేయించుకుం టుంది - పిల్లలు కలగకుండా! పెళ్ళయి, తన కడుపున కాయకాస్తే, ఈ పసివాణ్ణి తను సరిగా చూడదేమో నని సాంబయ్య కాదంటాడని! ఏమయితేనేం, యిద్దరికీ పెళ్ళవుతుంది. ఎప్పుడు? చెప్పులు కుట్టే సాంబయ్య డబ్బుతో, కాలేజీలో చదువుకుంటున్న శారదమ్మ (సుమలత) తను ప్రేమిం చిన యువకునితో (సర్వదమన బెనర్జీ) వచ్చి, యితని అనుమతీ ఆశీర్వాదమూ కోరినమీదట, అమాంత్రం ఆమెని కాబోయే పెళ్ళాం స్థానం నుంచి చెల్లెలి స్థానానికి మార్చేసి, తాగుడు కాస్త రుచి చూసి, గంగ కారణంగా స్థిమితపడి, ఒకదారికి వచ్చాక! బ్యాంకు, యితని చెప్పుల షాపుకి రుణం యిస్తుంది; బావమరిది గోవింద్ దానిని తగలబెట్టి, ఆ మంటలలో ఒకణ్ణి చంపి ఏడెనిమి దేళ్ళపాటు జైలుకెళ్తాడు. ఈలోగా సాంబయ్యకి అయిదారు షాపులూ, కారూ, బంగాళా యిలాటివన్నీ వచ్చే స్తాయి. మామగారు ఎనిమిదేళ్ళ బాలుని బస్సులో కాన్వెంట్ కి తీసుకు వెళ్తాం టాడు - సాంబయ్య అన్నీ తెలిసిన ఆదర్శవాది గనక!.... జైలునుంచి బయటికొచ్చిన గోవింద్, తన కొడు కుని మచ్చిక చేసుకుంటాడు. కోర్టు గోవిందు పక్షమే అవుతుంది.... పిల్ల వాడిని కాపాడేందుకుగాను తన ఆస్తి నంతా గోవిందుకి రాసిచ్చేందుకు సిద్ధపడతాడు సాంబశివరావు. చెట్టు కింద చెప్పులు కుట్టుకోవడంలోనే సుఖం వుందనిపిస్తుంది చివరికి సాంబయ్య, గంగలకు - వారితోబాటు పెంపుడుబాలుడు కూడా!.... ఇది విశ్వనాథ్ చిత్రం కాదు; చిరంజీవి చిత్రం, చిరంజీవి అభిమానులు మెచ్చే చిత్రం. 'దీనిని మోడరన్ ఫేబుల్' అని కూడా అనలేము. గంగ తను చదువు కునేందుకు స్కూలుకి వెళ్ళడమేమిటి - యింట్లో ట్యూటర్ని పెట్టి చెప్పించ లేరూ? క్రిమినల్ కి, పదేళ్ళ నిండని కొడుకుని వొప్పగించకండి, అర్ఫ నేజ్ లో చేర్పించండి – అని సాంబయ్య కోర్టువారికి విన్నవించుకోవచ్చుగా! ఇలాటివి చాలా....పాటలలోని సంగీత సాహిత్యాలు రసవత్తరంగా ఉన్నాయి. అవే ఈ చిత్రానికి కొంతమేర రక్ష....

దర్శకులు: విశ్వనాథ్; నిర్మాత: ఏడిద నాగేశ్వరరావు.

కవిత

# జీవన రాగం

## సరోజినీ ప్రేమ్‌చంద్



పెటిల్లుమను పిలుపు
చెవి తాకునంతలో
తటాలున మెరసి
మాయమౌ
తటిల్లత—
జీవితం !

క్షణక్షణము కరిగి
నీరమై ప్రవహించి
విశ్వావర్త మహానంత
సింధువు జేరి
అస్తిత్వమే అంతరించిన
మంచుముక్క—
జీవితం !

కఠోర వాస్తవ
శిలా స్పర్శతో
నేల కూలిన
ఊహా కన్యా
చేలాంచల బంధిత
స్వప్న విహారము—
జీవితం !

మెల్లన తాకి
ఉల్లము ఝుల్లనజేసి
అంతలో తన దారిన
తా సాగిపోవు
పిల్ల తెమ్మెర—
జీవితం !

తపనుని దాడికి
ఉసురుసురంటూ
వేసారే
పరితప్తులపై
నాలుగు చినుకులు
కురిపించి మురిపించే
వేసవి వానజల్లు—
జీవితం !

అమృతలోకపు సౌరభాలతో
మర్త్యులను ఆనంద లోకపు
డోలిక లూగించి
తెల్ల వారుతునే
నేల వాలే
పారిజాత సుమ
జీవిత కాలమెంత ?
అంతేనా జీవితం !
చెలీ !
ఇక సమయమెక్కడ
ఒక్క ప్రేమకు తప్ప !

పువ్వుల వానలు వలె
పున్నమి వెన్నెల వలె
దివ్వెల పండుగ వలె
గడిచి పోనీ
ఈ చిన్ని పయనం !

అసూయల అగ్నుల్లో
రోష బాష్ప కషాయిత

నేత్రాలలో
ద్వేష భరిత
వ్యర్థాలాపాలలో
బ్రతుకు ద్రుమము
సుడి వడేను !

వంతలు చింతలు
పంత గింపులు
గత విషాద చరితల
చర్విత చరణం

నిట్టూర్పులు
నిరంతర అశ్రుధారలు
నిరమించేను
జీవన మధుధార !

తరళ ధవళ
నవ కాంతులతో
కుసుమించిన మనసులతో
రాగ పూరిత గళములతో
మధు రాగపు కూర్పులతో
స్నేహలతలు అల్లుకొంటూ
పథికుల మందరమూ
వసంత గీతికలు
ఆలపించుదాం !

నింగిలో
నేలలో
గాలిలో
పూలలో
నీటిలో
బాటలో
తీగలై
రాగమూ
కలిసి పోగా
సుమధుర
సురభిళ
సుషుప్తిలో
కరిగి పోదాం
కలిసి పోదాం !

కరిగి పోదాం
కలిసి పోదాం !

---

ఉదయకాంతులు ప్రభాతాన్ని సూచిస్తున్నాయి: ప్రతి ప్రభాతంలోను కర్పూర నీరాజనం ఉంది.

పర్వత శిఖరాలు కూనిరాగం తీస్తాయి; పెద్ద పట్నాలు నానా యాతనా పెడతాయి.

నేను మనుషుల మతాల గురించి మాట్లాడను - మతాలన్నీ దేవునికి మనిషికీ మధ్య నిదురిస్తాయి.

పడవ ప్రమాణంలో తెడ్డుపైకి తీసినప్పుడు, తెడ్డుపై మిలమిల్లాడే కాంతి చినుకులు, నీటిలో కలవబోతాయి.

కాలిబాట లేని అడవులలో ఆనందం వుంది; ఒంటరితీరాన వేకువ కాంతి వుంది; సముద్ర గర్జనలో సంగీతం వుంది; అందుకని ప్రకృతి నెక్కువ ప్రేమించి మనిషిని తక్కువ చేయను.

**లార్డ్ బైరన్**

# భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటి

జాతీయ సమైక్యతా సాధన కోసం కృషి సల్పుతున్న భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారు తమ పద కొండవ సాంస్కృతిక కార్యక్రమా లను ఢిల్లీలో మూడురోజుల పాటు భారీ ఎత్తున నిర్వహించడానికి సర్వ సన్నాహాలు పూర్తి చేసుకున్నారు. మొదటి రెండు రోజులు - అనగా 1987 అక్టోబర్ 16, 17 తేదీలలో ఢిల్లీ టాల్కటోరా ఇన్డోర్ స్టేడి యమ్లో జరిగే యీ వుత్సవాలు సంగీత, నృత్య కార్యక్రమాలతో నిండి వుంటాయి. ఇవి వియస్టి ఇండస్ట్రీస్ వారి సహాయ సహకారాలతో "Spirit of Freedom Concerts" అనే పేరుతో జరుగుతాయి. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని విశ్వ మానవ సంక్షేమాన్ని, లలిత కళల ద్వారా పెంపొందించాలని దీక్ష పూనిన భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ, ఈ మహోత్సవాలలో పాల్గొని తమ లక్ష్యసాధనకు తోడ్పడవలసిందిగా, సర్వశ్రీ పివి నరసింహారావు, జలగం వెంగళరావు, పి వెంకట సుబ్బయ్య, మాజీ రాష్ట్రపతి గ్యానీ జైల్సింగ్, బిడి జట్టి వంటి ప్రముఖ నాయకులను; డా॥ బాలమురళీ కృష్ణ, పండిట్ జస్రాజ్, డా॥ యస్. రమణి, హరి ప్రసాద్ చౌరాసియా, యస్పి బాలసుబ్ర హ్మణ్యం, యస్. జానకి, యస్. పి. శైలజ వంటి ప్రముఖ కళాకారులను ఆహ్వానిస్తున్నారు.

16-10-87 - శుక్రవారంనాడు జరిగే శాస్త్రీయ సంగీత జుగల్బందీలో డా॥ యమ్. బాలమురళీ కృష్ణ, పండిట్ జస్రాజ్ ఢిల్లీలో మొదటిసారిగా ఒకే వేదికమీద తమ గాన మాధుర్యంతో అందరిని తన్మయులను చేస్తారు. కర్నాటక సంగీతంలో ఒకరు నిధులైతే, హిందుస్థానీ సంగీతాన్ని కాచి వడపోసిన వారు మరొకరు. ఈ ఇరువురూ పాల్గొనే యీ జుగల్బందీ విశేషాకర్షణగా- ఉంటుందని చెప్పనవసరం లేదు.

17-10-87 - శనివారం నాడు - వేణుగానంలో జుగల్బందీ - సంగీత ప్రపంచానికి చిరపరిచితులై తమ వేణు వాదనంతో రసజ్ఞులను మంత ముగ్ధులను గావించే శ్రీ హరిప్రసాద్ చౌరాసియా- హిందుస్థాని సంగీత పద్ధతిలోను, డా॥ యన్ రమణి- కర్నాటక సంగీత పద్ధతిలోను.

ప్రముఖ కథక్ నృత్య కళాకారుడు బ్రిజ్ మహారాజ్ వంటివారి ఆశీస్సులు పొందిన, 'ఢిల్లీ కథక్ కేంద్ర' బృందం వారిచే కథక్ నృత్య కార్యక్రమం ఈ ఉత్సవాలలో ఉంటుంది.

ఢిల్లీలో జరిగే యీ సాంస్కృతి కోత్సవాలకు సర్వశ్రీ జలగం వెంగళ రావు. కేంద్రపరిశ్రమల మంత్రి వర్యులు, పాట్రన్గాను, కె. పరాశ

రన్, అటార్నీ జనరల్ ఆఫ్ ఇండియా, రిసెప్షన్ కమిటి చైర్మన్‌గా, జి.వి.జి. కృష్ణమూర్తి- అడిషనల్ సెక్రెటరీ ఆఫ్ లా ఎగ్జిక్యూటివ్ వైస్ చైర్మన్‌గా, పి. ఆనందరావ్, యస్.వి.యన్. మూర్తి- ఢిల్లీ ఫెస్టివల్ కన్వీనర్సుగాను వ్యవహరించడానికి అంగీకరించారు. ఇంకా ప్రముఖులు ఎందరో ఉత్సాహవంతంగా పాల్గొంటున్నారు.

మనసుకు కొంత ఊరట కలిగించేది దైవధ్యానం. ఆ దైవం - అల్లా కావచ్చు, క్రీస్తు కావచ్చు, రాముడు కావచ్చు. ఆ దైవానికి యింకే పేరైనా వుండి వుండవచ్చు. అలాగే ప్రార్థించే ప్రదేశాలు కూడా వేరుకావచ్చు. కాని ఆ దైవ చింతనలోనే ప్రతి ఒక్కరు మన శ్శాంతినిపొందుతున్నారు. జాతీయ సమైక్యతాసాధనలో ఒక భాగంగాఅటువంటి సన్మార్గాభిలాష అందరిలో కలిగించాలని భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ సంగీతోత్సవంతో సమ్మిళితమైన భక్తిరస కార్యక్రమం చేపట్టుతూ ఉంటుంది. కాశ్మీరం నుండి కన్యాకుమారివరకు, గుజరాత్‌నుండి అస్సాం వరకు అందరికీ ఆరాధ్య దైవం శ్రీ వెంకటేశ్వరస్వామి. వారి కరుణాకటాక్షాల కోసం అన్ని లాంఛనాలతో స్వామివారికి అన్ని సేవలతో పూజలు చేసి, పండితుల వేద ఘోషల మధ్య భక్తి సంగీత కార్యక్రమాల నడుమ భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటివారు 18-10-87 ఆదివారం రోజున ఢిల్లీ టాల్ కటోరా యిన్‌డోర్ స్టేడియంలో "బాలాజి కల్యాణోత్సవం" జరుపబోతున్నారు. నాదస్వర విద్వాంసుడు శ్రీ టి. ఇ. పళనిస్వామి బృందం వారిచే నాదస్వర వాదనంతో ప్రారంభమయే యీ భక్తి సంగీత కార్యక్రమంలో డా॥ బాలమురళీకృష్ణ, శ్రీ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి యస్. జానకి, కుమారి యస్. పి. శైలజ, శ్రీ బాలకృష్ణప్రసాద్, శ్రీ మోహనకృష్ణ, శ్రీమతి శోభారాజు మొ॥వారు భక్తి సంగీతాన్ని వినిపిస్తారు. కుమారి పినాజ్ మసాని, శ్రీ సిరాజ్‌ఖాన్, వాసిఅహ్మద్ నశీద్ అహ్మద్‌ల సహకారంతో గజల్స్, బసవరాజ్ బ్రదర్స్ వాద్య సంగీతం.

ఈ కార్యక్రమాల వెనుక ఎంతో మంది వ్యక్తుల ఆదరణ సహాయ సహకారాలు నిర్విరామ కృషి ఉంది. సాంస్కృతి కార్యక్రమాల ద్వారా జాతీయ సమైక్యత సాధించాలనే ఆశయంతో ఉత్సాహంతో ముందడుగు వేస్తోంది భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ.



గమనిక:- ఎప్పటిలాగే యీ వుత్సవాలకు ప్రవేశ రుసుము లేదు. కాని ఆహ్వాన పత్రము లేనిదే లోనికి రానివ్వరు. అంచేత ఆహ్వాన పత్రము కావలసిన వారు యీ క్రింది ఎడ్రస్‌లలో ఒకదానికి వ్రాతమూలకంగా తెలియజేసి పొందవచ్చును.



శ్రీ పి. ఆనందరావు
సి-1-18, జనక్‌పురి, న్యూఢిల్లీ
శ్రీ ఎస్. వి. ఎన్. మూర్తి
సెక్టార్ III/265, ఆర్. కె. పురం

హాస్యరసం

# లుగు సినిమాల్లో

## వివికె రంగారావు



మొన్న మొన్నటిదాక ప్రతి తెలుగు చిత్రంలోనూ కనీసం ఒక్క హాస్యగీత మైనా లెక్కకు ఉండేది. ఈ నియమం యిటీవల సడలుతూ వున్నా అడపా దడపా అటువంటివి తటస్థ పడుతూ, సందర్భానుసారం ప్రేక్షకులను రంజిస్తునో భంజిస్తునో వున్నాయి.

ఈ హాస్య గీతాలు సర్వ సాధారణంగా వినిపిస్తున్న కంఠాలు పిఠాపురం, మాధవపెద్ది, స్వర్ణలత, ఎల్ ఆర్ ఈశ్వరి, కె. జమునారాణి, అరుదుగా ఘంటసాల, పి. బి. శ్రీనివాస్, పి. సుశీల, ఎస్. జానకి కూడా ఇటువంటి పాటలు పాడారు. అరువు కంఠాలతో కాకుండా యెవరికి వారే పాడుకునే రోజుల్లో పేరు పొందిన ఆస్సైగాళ్లూ ఆస్సెపాటగాళ్లూ ఒక్కళ్లే. శివరావు, రేలంగి, నల్ల రామ్మూర్తి, సీతారాం, కనకం పాడిన హాస్య గీతాలలో కొన్ని యింకా మరపురానివి ఉన్నాయి. ఇంకా ముందుతరంలో కూడా కొందరున్నారు కాని వారితో నేటి పఠితలలో పదవశాతం వారికి తెర పరిచయం కూడా వుండదని వారిని వదలివేయటం జరిగింది. (లంక సత్యం, డా॥ సి. హెచ్. బి. వెంకటాచలం యిత్యాదులు.)

తెలుగు చిత్రాలలో హాస్యగీతాలు బాలామట్టుకు చమత్కార పరిమళంతోనే రాజిల్లినా, అప్పుడప్పుడు అశ్లీల దుర్గంధం కూడా వెదజల్లాయని చెప్పక తప్పదు. దీనికి ఒక కారణం కొందరు రచయితలూ దర్శక నిర్మాతలూ అశ్లీలాన్ని స్ఫురింపజేయటం హాస్యమనుకోవడమే - యేడవలేక బోర్లపడినట్లు. మరొక కారణం గ్రామఫోన్ రికార్డులలో కామిక్ గీతాలకు పేరు పొందిన దొడ్డమ్మ, డా॥ సి. హెచ్. బి. వెంకటాచలం, వల్లూరి జగన్నాథం, బందా కనకలింగేశ్వరరావు వీరందరి పాటలలోను సూచీ ప్రాయంగానో చెంపదెబ్బ వాటంగానో ద్వంద్వార్థ సంజనిత హాసరేఖ వుండటం. కాని 'ఎర్రావెర్ర నిదానా, ఓయమ్మో యెత్తు పిర్రలదాన, నీపిర్ర మీద పిడుగుబడా నిన్నేలు కోనిత్తునా' అని టి. వి. ఎస్. శర్మ (కళా. దర్శకుడు) ప్రతిజ్ఞ చేసినప్పుడూ, 'పన్నెండేళ్ల కుర్రాడే పైట కొల్లగొన్నాడే' అని బందాకనక లింగేశ్వరరావు మొరపెట్టినప్పుడూ, బత్తాయి పళ్లగురించి వల్లూరి జగనాథం, తడిసిన దేహాల గురించి దొడ్డమ్మ 'నా కాలము నాడేలము నా డేలాసంటే నేమే బలే పిన్నమా' అని డా॥ సి. హెచ్. బి.

వెంకటాచలం గుసిసినప్పుడూ, అంతర్లీ నంగా వున్న ద్వంద్వార్థం వెగటు కలి గించేది కాదు. అంతంత మాత్రంగానే యీనాటి సినిమా కోసం ప్రత్యేకంగా వ్రాయించిన పాటలు వింటుంటే వమ నాశమన స్థితి కలుగుతున్న దంటే యెందుచేతనంటారు ? నిజానికి సరియై నా కారణమేదో నాకూ స్ఫురించలేదు. ఒకటి అయితే అయివుండవచ్చు. నాటి పాటలలోవున్న ఒకవిధమైన అమాయ కత యీనాటి పాటలలో లేకపోవటం.

హాస్యర స్తోత్పత్తి గావించే యే పాటయినా హాస్యగీతమేనని స్థూలంగా చెప్పకోగలిగినా సూక్ష్మంగా చూస్తే వీటిలోనే కొన్ని తరగతులు కనబడక మానవు. సౌకర్యాని కోసం వాటి నీ విధంగా విభజిద్దాము.

1. పాట సాధారణము హాస్య గాడు పాడేది.

2. పాట సాధారణమే. సాధారణ పాత్ర పాడేదే. సన్నివేశాన్ని బట్టి హాస్యరసాన్ని సంతరించుకొనేది.

3. పాట, పాత్ర రెండు సాధార ణమే అయినా చిత్ర ప్రయోగం ద్వారా హాస్యగీతాల జాబితాలోకి చేరేవి.

4. పాటే హాస్య ధోరణిలో వుండేది.

5. అపహాస్య గీతాలు. చివరి విభాగం గురించి ఇక్కడే ఒక మాట. ఒక వ్యక్తినో, వ్యవస్థనో అపహసిస్తూ వ్రాయబడిన పాటలు కానివి. ఏదో కారణంచేత అపహాస్యం పాలైనవి.

1. "గొప్ప గొప్పోళ్ల లోగిల్నిండా రిడాయి బడాయ్
కొద్ది కొద్దోళ్ల పుటకే హాయ్
రొక్క మెక్కువయే తలికి
సీకూ సింతా
జంట రెక్కలాడే వోళ్లే సిలకా గోరింకా"
(మల్లాది రామకృష్ణశాస్త్రి : అశ్వత్థామ: చిన్న కోడలు)

మెరుగు చెడని సరికొత్తది
ఇంకెయ్యాల అడిగిన ఉత్తది
ఇదిర అదును కదిలిరా
భలే దొరలకు దొరకని సొగసు
అనువుగ దొరకున రంగయ్యా

(సముద్రాల సీనియర్: ఘంట శాల : షావుకారు) నేపథ్య గాయకులు పాడి నటీనటు లభినయించిన మొదటి పాట, కనకం పాడి, ఆడిన రెండవ పాట యీ కోవకు చెందిన వాటికి చక్కని మక్కువలు. రచనలో నిజానికి హాస్యం లేదు. ఒకదానిలో జగమను కొనే సత్యమూ, రెండవ దానిలో ఊరింపూ ఉన్నాయి. కాని వాటిని హాస్య వేషధారులు తెరపై పాడటం వలనా, పాట పాడటంలో కూడా కొంత హాస్యరస స్ఫోరకమైన మెళకు వలు ఒప్పించటం వలనా అవి హాస్య గీతాలనిపించుకో గలిగినవి.

2. ఉత్తమ తరగతి హాస్యానికి చెందినవి, ఆ భావానికి హాయి పందిళ్ల లనదగినవి బాలాభాగం యీ విభా గంలోనే వున్నాయి. వీటిల్లో మరొక సుగుణం వరసలోనూ రచనలోనూ హాస్యం వుండనే వుండదు కనుక వెకిలి తనానికి తావే లేకపోవటం.

"సత్తూ విత్తుల భేదము తెలి యక విత్తే సత్తనుకున్నావు నా



జాన్ గిల్‌మెన్ సమర్పించు

రాధా చిత్ర

# దయామయుడు

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం-నిర్మాత

**విజయచందర్**

సినిమా స్కోప్

సంగీతం. సత్యం - ఫోటోగ్రఫీ. వి.సుబ్బారావు - మాటలు. మోదుకూరి జాన్సన్

యెత్తు నెరగకున్నావు
ఓ మనసా నేనెవరో నీకు తెలుసా''
(పింగళి : ఘంటసాల : పెళ్లిచేసిచూడు)

వింటానికి కేవలం యిదొక తత్త్వం. రచనలో హాస్యం వెతికి చూసినా కనబడదు. కాని సినిమాలో జి. వరలక్ష్మి నర్సుగా భర్త దగ్గర హొయలు కురిపిస్తూ 'లీల'గా మామ గారి దగ్గర అణకువ అభినయిస్తూ వుంటే చెరుకురసంవంటి హాస్యరసం ప్రవహిస్తుంది.

3. ఈ విచిత్రమైన వరవడి వరస లోనూ వుండవచ్చు. రచనలోనూ వుండవచ్చు. మామూలు పాటల జాబితాలోంచి ఆ పాటలను తప్పించి హాస్య గీతాలలో చేర్చేది యీ విచిత్ర మైన గుణమే.

'లంబో తళుక్కు చెళుక్కు చూడ వయా - వణక్క గొణక్క మిణక్క సణక్క చూడవయా'
(రావూరి : జి. రామనాథన్ : వరుడు కావాలి.)

అన్న భానుమతి పాటలో ఆ మాట లలో అర్థం పర్థం లేదు. కానీ ఆ మాటలు ఆ వరస ఒక విధమైన హాస్యాన్నే జనింపచేస్తాయి. ఇటువంటివే "చంద్ర లేఖ"లో 'హైయో పకడి యామా' (ఎస్. రాజేశ్వరరావు) "మాయలమారి" లో (ఆదినారా యణరావు) గూడెం పాటలు, "టింగ్ రంగా"లో నల్ల రామ్మూర్తి సీతారాం పాడిన 'నారయణః' (టి. వి. రాజు) అన్నది.

4. నూటికి తొంభై పాళ్ల హాస్య గీతాలు యీ తరగతివే అయివుం టాయి. వీటిలోనే సున్నితమైన హాస్యమూ, సమ్మెట పెట్టు లాంటి ద్వంద్వార్థమూ రెండు కనబడగలవు.

చిటారు కొమ్మను మిటాయి పొట్లం
చేతికందదేం గురుడా
వాటం చూసీ వడుపు జేసీ
వంచర కొమ్మను నరుడా
పక్కన మెలిగే చక్కని చుక్కకు
చక్కిలిగింతా లేదేం గురుడా
కంచు మోతగా కనకం మ్రోగదు
నిదానించరా నరుడా
(మల్లాది రామకృష్ణశాస్త్రి : ఘంట సాల: కన్యాశుల్కం)

పై గురుశిష్య సంవాదంలో రచనా చమత్కృతీ వున్నది, రమ్యతా వున్నది, ద్వంద్వార్థమూ వున్నది. ఆ రెండ ర్థాలలోను పెడర్థం లేదు. సున్నిత మైన హాస్యమే ఉన్నది. ఒక కొమ్మ గిరీశ మెక్కిన మామిడి చెట్టుది. మరొకటి బుచ్చెమ్మ. ఇన్ని సుగుణాలు ఒక్క హాస్య గీతంలో సమకూరటం చాలా అరుదు.

ఇక కంపు గొట్టిన హాస్య గీతాలు ఉన్నవి. ఇవి వ్రాసినవారికీ వ్రాయించు కున్న వారికీ సరియైన అభిరుచి లేకనో లేక హాస్యమంటే వారి పరిభాషలో బూతు అనే అర్థం వుండటం వలనో యీ దుర్వాసన పుట్టింది. దీనికి కొంత బాధ్యత వహించవలసినది సినిమా లలో హాస్య గీతాలు పాడుతూ పేరు సంపాదించుకొని అపభ్రంశాన్ని అపు పేడని కలిపి హాస్యమనే పేరుతో ప్రైవేటు గ్రామఫోను రికార్డులు ఇచ్చిన

కొందరు నేపథ్య గాయకులు. వారి లాగానే ఈ ప్రైవేటు పాటల రచయిత లకు మతి ప్రతీ లేదనిపిస్తుంది ఆ రికార్డులు వింటుంటే, కాని రచయితలు మాత్రం నూటికి తొంబై తొమ్మిది పాళ్లు సినిమాలకు వ్రాసేవాళ్లు కారు. అలా వ్రాయడానికి వలసిన ప్రతిభా వ్యుత్పత్తులు లేక బూతే శరణ్యమని భోరుమన్నవారు. వీటి విరివి అమ్మకం సినిమా రచయితలనూ, నిర్మాతలనూ కొంతవరకు ప్రలోభ పెట్టి అటువంటి పోకడలను యిక్కడా ప్రోత్సహించిన దని చెప్పవచ్చు.

ఈ కంపు లేకుండా వందలాది హాస్య గీతాలను వ్రాసి ఆ బాల గోపా లాన్ని ఆనందపరచిన ఒకే ఒక కవి రాజు కొసరాజు. వీరి రచనలకివి ఉదాహరణలని చెప్పడంకన్న గత పదేళ్లలో అశేష ప్రజాదరణ పొందిన హాస్య గీతాలను యేకరువు పెట్టడం సులభం. మచ్చుకి :

నాజూకైన గాడిదా నా వరాల గాడిదా - నమ్మినోళ్ల మోస పుచ్చదు నాలుక్కాళ్ళ గాడిదా
(ఘంటసాల : మర్మయోగి)

తక్కిన రచయితలూ అవకాశాన్ని బట్టి హుషారైన హాస్య గీతాలు వ్రాస్తూనే ఉన్నారు. 'ఇరణ్యకసిపుడరా' నిన్ను యిరసక తింటానురా', అని జి. కృష్ణమూర్తి 'గురువును మించిన శిష్యుడి' లోనూ 'మరదలా చిట్టి మర దలా' అని డా॥ సి. నారాయణ రెడ్డి 'గోపాలుడు భూపాలుడు' లోనూ "ఇండియాకు రాజధాని ఢిల్లీ, నా హృదయాలికి ప్రేమరాణి లిల్లీ" అని "అక్కచెల్లెళ్ళ"లోను ఆరుద్రా చక్కని హాస్య గీతాలే వినిపించారు.

ఆరుద్ర వ్రాసిన సుమారు వంద హాస్య గీతాలలోను మకుటాయ మానం 'నువ్వంటే నాకు మోజు - అలా వ్రాసి స్తానే దస్తావేజు' అన్న పాట (అశ్వత్థామ : మా ఇంటి మహాలక్ష్మి) ఆ పాట పాడే పాత్ర వకీలు దగ్గర గుమస్తా. ఆ పారిభాషక పదాలే యీ ప్రేమ గీతంలో చొప్పించి హాస్య రసం చిప్పిల జేశారు.

నీ మనసు నా హృదయం ఎక్స్ పార్టీలై
తీసుకున్నాయి డిక్రీని నాపై
మీను లాంటి నీ కన్నులు అమీనై
జామీను లేని నా మదిని జప్తు చేసినై
చేసుకుందాం నువ్వు నేను సెటిల్ మెంట్
రాసుకుందాం మేరేజికి అగ్రిమెంట్
సౌఖ్యానికి దాఖలు చేద్దాం పిటీషన్
భయ మెందుకులే రాదు లిటిగేషన్

5. అపహాస్య గీతాలు, ఇవి అని కను క్కోవడానికి కొంత, విషయ జ్ఞానం ఒకింత నిశిత బుద్ధి అవసరం. లేకపోతే

ద్వారక వీడి నీరధి లోనా
దాగిన ధీరా రా
(సముద్రాల సీనియర్ : వీరాభిమన్యు)

అన్న పాటలో అందమే కనబడు తుంది. ద్వారక నీరధిలో వుందనే మాట స్ఫురించదు. అలాగే 'అనురాగా నికి కనులు లేవని ఆర్యులు అన్నారు'.
(ఆరుద్ర : సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి)



శ్రీ

# హరి సర్వోత్తమ రావు

## డా॥ వియన్ శర్మ

ఒక మహానుభావుడు మరొక మహానుభావుని గురించిన జ్ఞాపకాలు చెబుతున్నారు. ఇరువురూ దివంగతులే! ఒకరు గ్రంథాలయోద్యమ పితామహులు, మరొకరు బాలోద్యాన వన సంస్థాపకులు. ఒకరి శత జయంతి జరిగింది — మరొకరికి శత జయంతికి పదేళ్ల వ్యవధి ఉంది. ఇటువంటి మహాపురుషుల జీవితాలే మన జాతీయ సంపద ; భావితరానికి వేగు జుక్కలూను.

1907-1908 సంవత్సరానికి నేను చిన్నవాణ్ణి. మేమున్నది మధ్యరకం బస్తీ. గుంటూరు, బెజవాడ, బందరులకు సమీపమందున్న పట్టణాలలో వందేమాతరం ఉద్యమం పట్ల అభిమానం చూపుతున్నవారు కోకొల్లలుగా వుండగా మావూరి వారికి దీని సంగతి యేమీ పట్టేదికాదు. ఇప్పటికీ నాకు జ్ఞాపకం, ఒకనాడు పరాయి మనిషి ఒకరు మావూరికి వచ్చి, వూళ్ళో వందేమాతరం కాగితాలు పంచినారు. ఆరోజు సాయంత్రం మావూరి చెరువు సమీపంలోని ఒక యింటిముందు సభ జరుగుతుందని, వూరిలోని వారందరూ ఆ సభకు రావాలని ఆయన పంచిన కాగితాలలో వ్రాసి వుంది. అప్పటికి నా యింగ్లీషు చదువు ప్రారంభం కాలేదు. అయినప్పటికీ మాయింటి వాతావరణం ప్రపంచ పరిస్థితులను అవగాహన చేసుకొనడానికి అవకాశం కలిగించింది. అందుచేత పదిసంవత్సరాల ప్రాయంలో నున్న నేను ఆ సభకు హాజరైనాను.10 వేల జనాభా గల మా యూరిలో అనాటి సభకు పట్టుమని 10 మంది కూడా హాజరు కాలేదు. ఏదో పట్నవాసం నుండి వచ్చిన అనాటి ఉపన్యాసకుడు ప్రజల కష్టనిష్టురాలను గురించి చెప్పి మాకుద్రేకం కలిగించాడు. ఆయన తన ప్రసంగంలోహరిసర్వోత్తమరావుగారి పేరు చెప్పి ఆయనను గురించి తెలిపిన విషయాలు విన్నప్పుడు మాకు దుఃఖం కలిగింది. దీనిపై వారిని గురించి అధికంగా తెలుసుకోవాలనే ఆకాంక్ష నాలో బయలుదేరింది.

నేను మా వూరి మిషన్ స్కూలులో చేరినాను. మాది ఆ రోజులలో ప్రశస్తమైన పాఠశాల. నేను సెకండు ఫారం చదువుచదువుతున్న రోజులలో శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు గారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి బయలుదేరింది. దీని ప్రచురణలలో

మొదటిపుస్తకం అబ్రహాంలింకను జీవిత చరిత్ర నన్నాకర్షించింది. దీనికర్త శ్రీ హరిసర్వోత్తమరావుగారు. వీరిని గురించి తెలుసుకొనడానికి నేను కొందరు పెద్దలను కలుసుకున్నాను. వీరి రాజకీయాలు ప్రభుత్వానికి నచ్చని కారణంచేత వీరిపై కేసుపెట్టి 3 సంవత్సరాలు కఠినశిక్ష విధించి జైలుకు పంపారని వారు చెప్పారు. ఇది విని వారు గావించిన నేరమేమిటో తెలుసుకోవాలని ఉబలాట పడినాను. అప్పట్లో నాకేసమాచారము లభించ లేదు. కాని నా ఆకాంక్ష తగ్గలేదు.

ఆరోజులలో మాపాఠశాల నిర్వాహకులు మాలో రాజ భక్తిని పెంపుచేయుటకు అనేకవిధాల తంటాలుపడుతూ వుండేవారు. అప్పటి ప్రభుత్వం యొక్క గొప్పతనాన్ని గురించి, ఆనాటి బ్రిటిష్ చక్రవర్తిని గురించి మాకుపన్యసించటానికి వూరిలోని పలుకుబడి గల పెద్దలను ఆహ్వానిస్తూ వుండేవారు. వీరిలో ప్రభుత్వ బిరుదులను, సన్మానాలను అందుకొన్న వారుండేవారు. వారు వారి బోధల ద్వారా మమ్మల్ని రాజ భక్తి పరాయణులుగా తీర్చి, అదుపాజ్ఞలలో ఉంచడంలో మా స్కూలు గణనీయమైనదిగా ఆరోజులలో పేరుపొందింది.

ఆంధ్రుల ఆరంభశూరులనేమాట సామెతగా మారింది. దీని నౌకరు సోడాబుడ్డి గ్యాస్‌తో పోల్చారు. వందేమాతరం ఉద్యమ కాలంలో ఆంధ్రదేశంలో పొంగిపొరలిన ఉత్సాహం కొన్నాళ్ళ పిమ్మట తగ్గు ముఖం పట్టింది.

1911 నుండి 1915 వరకు విద్యార్థిగా నేను గడపిన కాలం అమూల్యమైనది. పాఠశాలలో లభించని లోకజ్ఞానాన్ని స్వయం కృషితో సంపాదించుటకు మా యింట్లోవారు నాకు తోడ్పడినారు. జీవితంలో నేను నా దారిని చూచుకొనుటకు ఆనాటి సాహిత్యం నాకు సహాయపడింది. ఆరోజులలో వెలువడుతూవుండిన ఆంధ్రపత్రిక యీ విషయంలో నాకెంతగానో ఉపకరించింది. దీనితోపాటు కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్ల రచనలు, విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ప్రచురణలు నావోటి వారెందరినో ప్రభావితులను చేయడంతో ఎవరికాళ్ళపై వారు నిలబడడానికి అవసరమైన శక్తిసామర్థ్యాలు లభించినవి. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి నిర్వహణలో కొమఱ్ఱాజు వారికి కుడి భుజంగా వుండి నడిపినవారు హరి సర్వోత్తమరావుగారని తెలుసుకొన్నప్పుడు ప్రభుత్వం వారినెందుకు నిర్బంధించినదో, వారి నెన్ని విధముల బాధించినదో తెలుసుకొనవలెననే నా కుతూహలం పెరుగుతూ వచ్చింది.

ఆ సమయంలో శ్రీ మైనంపాటి నరసింహం పంతులుగారు మావూరికి చేరుకొని న్యాయవాదవృత్తిలో స్థిర పడ్డారు. వీరు మదరాసులో వున్నప్పుడు హరిసర్వోత్తమరావుగారు కారా

గృహం నుండి విడుదల పొందివుండ డము, విజ్ఞానచంద్రికా గ్రంథమండ లిలో వారు భాగస్వాములుగా వుండ డము శ్రీ నరసింహం పంతులుగారు మండలికొక గ్రంథాన్ని రచించి యివ్వ డమూ జరిగింది. శ్రీ నరసింహంగారి ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి మేనల్లుడు, ప్రకాశం పంతులుగారు మాకు బంధువు. దీనిని పురస్కరించుకొని నేనప్పుడప్పుడు నర సింహంగారిని కలుసుకొంటూ వుండే వాణ్ణి. ఒకనాడు వారిని హరిసర్వోత్తమ రావుగారివిషయమై ప్రశ్నించాను. తాము భయులూ చాలాకాలంగా స్నేహితుల మని, రావుగారి దేశాభిమానం తనను ఆశ్చర్యచకితు చేస్తూవుండేదని, వారిని తాను మొదట దర్శించినది రాజమండ్రి లోనేనని, అప్పుడు వారక్కడ ట్రైనింగ్ కాలేజీలో విద్యార్థిగా ఉన్నారని రావు గారు ఎం. ఏ. ప్యాసైనా తదుపరి ఉపా ధ్యాయ శిక్షణ నిమిత్తం రాజమండ్రి వచ్చారని, వారు జన్మించినది కర్నూలు లోనైనా వారి పూర్వులు మహారాష్ట్రు లనీ, శివాజీ చక్రవర్తి శౌర్యపరాక్రమ ములు రావుగారి పూర్వీకులలో కూడా వుండేవనీ, వారి ఉపన్యాస ధోరణి ఉద్రేకపూరితంగా వుండేదనీ, తెలియ పరచవలసిన విషయాన్ని అద్భుతంగా వ్యక్తపరుస్తూ సభలో ఉద్రేకాన్ని ప్రేరేపించడంలో వారగ్రగణ్యులనీ ర సింహంగారు చెప్పారు.

శ్రీ సర్వోత్తమరావుగారి దేశాభి మానానికి, వారు చేస్తున్న కార్యకలా పాలకు ట్రైనింగ్ కాలేజీ ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ హడలిపోయి వారిని కళాశాలనుండి వెడల గొట్టాడనీ, అయినప్పటికీ ఆయన లొంగలేదనీ, రాజమండ్రిలోనే కొంతకాలముండి వందేమాతరం, స్వదేశీ, వయోజన విద్యా ప్రచారం సాగించారనీ, తదు పరి కృష్ణా మండలపు మిత్రుల ఆహ్వానంపై వెళ్ళి అక్కడ కొంతకాలం పత్రికనొకదానిని నిర్వహించినారనీ దీనిలో వ్రాసిన ఒక రచనను పురస్క రించుకుని వీరిపైన, వీరి సహచరులైన శ్రీ బోడి నారాయణరావుగారిపైన కేసుపెట్టి శిక్ష విధించినారనీ వారు మరికొన్ని వివరాలు తెలియజేశారు.

శ్రీ సర్వోత్తమరావుగారికి శిక్షపడి నప్పుడు వారిని చెరనుండి విడిపించు టకు ప్రభుత్వంలోని పెద్దలు కొందరు రాయబారాలు జరిపారు. బంధు మిత్రులు కూడ ఆయన దీనినుండి బయటపడడం ఆయన భవిష్యత్తుకు మంచిదని సలహా ఇచ్చారు. వారు క్షమాపణ చెప్పియున్న యీ పని జరిగేది. కాని వారందుకు సమ్మ తించలేదు. ఈ విషయాలను నరసింహం పంతులుగారు చెప్పి నప్పుడు హరి సర్వోత్తమరావుగారిని దర్శనం చేసుకోవాలనే కుతూహలం నాకు మరింతగా కలిగింది.

1913 మే నెలలో బాపట్లలో జరిగిన ఆంధ్ర మహాసభకు రావుగారు వస్తారనే ఆశతో నేనాసభకు హాజ రైనాను. వారు రానందున ఆశా భంగం పొందినాను. ఒకటి రెండు సంవత్సరాల పిమ్మట మా గ్రామంలో

గ్రంథాలయమొకటి సాపించాము. దీనికి వచ్చే పత్రికలలో ఎవరైనా శ్రీ హరి సర్వోత్తమరావుగారిని గురించి వ్రాస్తారేమోనని కుతూహలపడు తుండేవాణ్ణి. ఇందులో కూడ నేను, హతాశుడనైనాను. శ్రీ కొమర్రాజువారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము ప్రచారం పనిపై వారి ప్రతినిధి శ్రీ కృష్ణయ్యగారొకతూరి మావూరికి వచ్చారు. వీరు నరసింహం పంతులుగారి యింట్లో బస చేశారు. పంతులుగారి ఆదేశంపై నేను కృష్ణయ్యగారిని ప్రతిరోజూ వూరిలోని పెద్దలవద్దకు తీసుకొనివెళ్ళుతూ వుండే వాణ్ణి. ఆ సమయంలో కృష్ణయ్యగారు నాకు హరిసర్వోత్తమరావుగారిని గురించిన విశేషములు చెప్పి వారప్పుడు మదరాసులో ఉన్నట్లు తెలిపినారు. అప్పటికి వారి శిక్షాకాలం ముగిసి, ఇకపైన యథేచ్ఛగా వారు తమ కార్యకలాపాలు చూచుకొనుటకు అవకాశం లభించినదని విని నేను సంతసించినాను. ఆ సమయంలో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్రపత్రిక కార్యాలయాన్ని బొంబాయినుండి మదరాసుకు తరలించి, దినపత్రికగా దానిని నిర్వహించుటకు నిర్ణయించినట్లు, దీనికి వారు శ్రీ హరిసర్వోత్తమరావుగారిని సంపాదకులుగ నియమించినట్లు కృష్ణయ్యగారు చెప్పినప్పుడు నాకు కలిగిన ఆనందాన్ని వర్ణించలేను.

మా స్కూలులో విద్యార్థుల సంఘమొకటి వుండేది. ప్రతి సంవత్సరమూ వార్షికోత్సవం జరుపుకొని, దీనికి దేశంలోని పెద్దలను ఆహ్వానిస్తూవుండేవారం. అంతకు పూర్వం యెక్కువగా తెల్ల దొరలను ఆహ్వానిస్తూ వుండేవారు. ఒక యేడు సాహసంచేసి మేము రాజకీయాలతోపాటు విద్యావ్యాప్తికై కృషిచేస్తున్న మదరాసు వాస్తవ్యులు శ్రీ వి. యస్. శ్రీనివాస శాస్త్రిగారిని ఉపన్యాసకులుగా ఆహ్వానించాము. దీనిని పురస్కరించుకొని మరుసటి సంవత్సరం శ్రీహరి సర్వోత్తమరావుగారి నాహ్వానించడం మంచిదనుకొన్నాము ఆనాటి నుండి. మా ప్రిన్సిపాల్ మార్టిన్ దొర మంచి విద్యావేత్త. మా కోరికను వారికి విన్నవించినాము. వారు రావుగారికి జాబు వ్రాస్తామన్నారు. ఈ వార్త మావూరి పెద్దల చెవిని పడ్డది. మాది మునిసిపల్ పట్టణమైనా, ఇక్కడ చదువుకున్న వారు, లాయర్లు ఎక్కువగా వున్నా వారి ధోరణి చాలా సంకుచితంగా వుండేది. రాజకీయంగాగాని, సాంఘికంగాగాని జరుగవలసిన మార్పులకు వారు విముఖులుగా వుండేవారు. ప్రభుత్వానికి తొత్తులుగా వ్యవహరించేవారు. రావుగారి రాక వారిని భయకంపితులుగా చేసింది. దీనిపై వారు ప్రిన్సిపాల్‌గారిని కలుసుకొని రావుగారు విప్లవ వాదులని, ప్రభుత్వం వారిని శిక్షించినదని, వారి నాహ్వానించడం మంచిది కాదని సలహా చెప్పారు. దీనిపై ప్రిన్సిపాల్ చాలా సేపాలోచించారు. స్కూల్ లైబ్రరీలో నున్న మదరాసు యూనివర్సిటీ క్యాలెండరును తెప్పించారు. దీనిలో

ఆ రోజులలోని పట్టభద్రుల జాబితాలో రావుగారి పేరు, విరునామా, అప్పుడు వారు చేస్తున్నపని వివరాలున్నవి. దీనితో ఆయన భయపడవలసిన పని లేదని తీర్మానించుకున్నారు. వార్షికోత్సవం రోజు ఉదయం శ్రీ రావుగారు మదరాసు నుండి రైలులో వచ్చి వారి మిత్రులైన నరసింహం పంతులు గారి యింట్లో బస చేసారు. ఎంతో కాలంనుండి ఎదురు చూస్తున్న వారి దర్శనం చేసుకొనటానికి నేను పంతులుగారి యింటికి వెళ్ళాను. అజానుబాహువులు, గంభీరమైన మీసకట్టు బెట్టుసరి లేకుండా అప్యాయంగా మాట్లాడేవారి ధోరణి నన్ను పరవశుణ్ణి, చేసింది. నేను విద్యార్థిగ నున్నప్పటికీ, ఆ రోజులలో వెలువడుతూ వుండిన పుస్తకాలు, పత్రికల పఠనం ద్వారా లభించిన ఉత్సాహాన్ని ప్రకటిస్తున్నప్పుడు వారి ముఖ వికాసం నాకెంతో ఆనందాన్ని ప్రసాదించింది.

సాయంత్రం సభలో వారి ప్రసంగం బ్రహ్మాండంగా సాగింది. ఆనాటి ఆచారం ప్రకారం వారు అంగ్లంలో అనర్గళంగా గంటకు పైగా మాట్లాడారు. విద్యార్థుల నుద్దేశించి వారు తమ మాతృదేశం పట్ల చూపవలసిన భక్తిశ్రద్ధలను విస్మరించరాదని ,జీవిత రంగాలన్నిటితోను దేశ సేవకు నడుంగట్టి పనిచేయుట ధ్యేయంగా వుంచుకోవాలని వారు ప్ర బో ధ ం చేశారు. ఆనాడు మాలో ఉబికిన ఉత్సాహం నాకిప్పటికీ జ్ఞాపకమున్నది, ఆరాత్రికే వారు తిరిగి వెళ్ళిపోయారు, వారిని రైలెక్కించడానికి వెళ్ళిన వారిలో నేను కూడా ఉన్నాను. వారి ఉపన్యాసం విన్న తర్వాత మా వూరి పెద్దలలో కూడా చాలా మార్పు వచ్చింది. ప్రిన్సిపల్ గారిని వారభినందించడం జరిగింది.

ఆనాటినుండి పత్రికలతో నాకు అవినాభావ సంబంధం యేర్పడింది. పత్రికలకు వార్తలు వ్రాసి పంపడం ప్రారంభం చేశాను. దీనితో పాటు స్వతంత్ర రచనలకు కూడ పూనుకొన్నాను. ఆంధ్రపత్రికకు మావూరి వార్తలను పంపుతూ వుండేవాణ్ణి. ఆరోజులలో విలేఖరులు ఎంత వ్రాసినా పత్రికలవారు ప్రచురిస్తూ వుండేవారు. నేను ఆంధ్రపత్రికకు పంపుతూ వుండిన సమాచారాన్ని శ్రీరావుగారు స్వయంగా సవరించి ప్రచురిస్తూ వుండేవారు. నాకు ప్రోత్సాహకరంగా జాబులు వ్రాస్తూవుండేవారు. నేను 5 వ ఫారం చదువుతున్న కాలంలో స్థాపించిన గ్రంథాలయానికి మావూరి పెద్దలు సహాయపడుతూ మాకుత్సాహాన్ని కలిగించేవారు. మా గ్రంథాలయం పుస్తకాలను ఇతర గ్రామాలకు కూడ తీసుకొని వెళ్ళి, యిస్తూ వుండేవారము. ఈ పనిలో నిమగ్నమై పాఠాలపై సరియైన శ్రద్ద చూపనందున ఉపాధ్యాయులు నన్ను దండిస్తూ వుండేవారు. ఇంట్లో వారు కూడ నన్ను తరచు మందలిస్తూ వుండేవారు.

1915 ఏప్రిల్ నెల చివరలో నాకొక ఆలోచన తట్టింది. మదరాసుకుపోయి ఆంధ్రపత్రిక కార్యాలయంలో పని నేర్చుకోవాలని బుద్ధి పుట్టింది. నా కోరికను నరసింహం పంతులుగారికి విన్నవించాను. వారు సంతోషించి హరి సర్వోత్తమరావు గారికి ఉత్తరంవ్రాసియిచ్చారు. మేనెల ప్రారంభంలో మదరాసుకు చేరుకున్నాను. రైలుస్టేషను నుండి తిన్నగా రావుగారి యింటికి వెళ్ళినాను. వారప్పుడు యింట్లోనే వున్నారు. ఏదో వ్రాతపనిలో నిమగ్నమై వున్నారు. నేను వారికి నమస్కారం చేశాను, కొంచెంసేపు కూర్చోమని సంజ్ఞ చేశారు. వారి పని పూర్తవుతూనే ఆప్యాయంగా నన్ను పలుకరించారు. నా కోరికను వారికి తెలిపినమీదట "నీకేమిపని చెయ్యాలనివుంది ?" అని ప్రశ్నించారు. నా అభిప్రాయం తెలుసుకొన్న పిమ్మట, మదరాసులో వున్నంతవరకు తమ యింట్లోనే వుండమని చెప్పారు. భోజనానంతరంఇద్దరమూఒకరిక్షాపై ఆంధ్ర పత్రిక కార్యాలయానికి చేరుకొన్నాము. దారిలో పత్రికా కార్యాలయంలో జరిగే పనులను వివరించి, నాకోరిక యెంత వరకు నెరవేరుతుందో చెప్పలేమన్నారు. తాము చేయగలిగిన సాయం చేస్తామన్నారు. ఆంధ్ర పత్రిక కార్యాలయానికి చేరుకొన్న తర్వాత నన్ను మేడపైకి తీసుకొని వెళ్ళి, అప్పటికి నాగేశ్వరరావు పంతులు గారింకారానందున, నన్నొక తావున కూర్చుండబెట్టి, వారు వరండాలోని తమ గది లోనికి వెళ్ళిపోయారు.

రెండు గంటలు గడిచిన తర్వాత బయటకి వచ్చి నాగేశ్వరరావు పంతులు గారితో మాట్లాడినారు. ఆ పైన పంతులుగారి మనిషి ఒకరు వచ్చి నన్ను వారివద్దకు తీసుకొనిపోయారు. వారు, నన్ను కూర్చుండమని చెప్పి, నా విషయం రావుగారు తమకు చెప్పినారని, నేను నిరభ్యంతరంగా, సెలవులలో అక్కడ పని నేర్చుకోవచ్చునని చెప్పి, ఆఫీసుగదిలో నున్న మేనేజరును పిలిచి నన్ను ఫలానావారి కప్పగించమని ఆజ్ఞాపించారు. నన్నాయన, కార్యాలయం దిగువ భాగంలోనున్న ఒక తావుకు తీసుకొనిపోయారు. అక్కడ ఇద్దరు వ్యక్తులున్నారు. ఒక వృద్ధుడు, ఒక యువకుడు ; మేనేజరు నన్ను వారి కప్పగించాడు. వారిరువురు ముద్రాక్షర శాలనుండి వచ్చిన పొడుగుపాటి కాగితపు బొత్తులను పరిశీలిస్తున్నారు. ప్రక్కన లావుపాటి పెద్ద పుస్తకాలున్నవి. ఆ ముసలాయన నన్ను ప్రక్కన కూర్చుండబెట్టుకొని అక్కడనున్న కాగితాల బొత్తిలో ఒక కాగితాన్ని నాకిచ్చి, దానిని పరిశీలించటానికి అవసరమైన గుర్తులను తాము నేర్పుతామని చెప్పారు. ఆ ప్రకారంగా వారు నాకు కొంత పని పురమాయించారు.

సాయంత్రం నేను రావుగారితో పాటు రిక్షాలో వారి యింటికి వెళ్లాను. నా పని ఎలాగున్నదని వారడిగారు. పత్రికా రచన నేర్చుకొనడానికి వచ్చిన నాకు, ప్రూఫ్ రీడింగు పని అప్పగించి

నందున నేనెంతో నిరాశపడ్డాను. ఏమి చెప్పాలో తోచక నేనున్నంతలో నా సంగతి కనిపెట్టి మిక్కిలి అప్యాయతతో నా మీపు నిమురుతూ పెద్ద పనులు నిర్వహించటానికి ముందు చిన్న పనులు చేయటం ద్వారా భవిష్యత్తులో ఉపయోగకరంగా వుంటుందని, తాము అవకాశం లభించినప్పుడు అచ్చాఫీసులో కంపోజింగ్ (అక్షరాలు కూర్చే పని) నేర్చుకున్నామని, మొదట ఆ పని సులభమైనదిగా అనిపించలేదని, దీనిని సాధించినప్పుడు అంతులేని శక్తి నిస్తుందని, అప్పుడా పని కష్టమైనదిగా అనిపించదని తమ అనుభవాన్ని నాకు వివరించారు.

* * *

ఆంధ్రపత్రిక కార్యాలయం నుండి యింటికి చేరిన పిమ్మట శ్రీ రావుగారు



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది: 15-10-1987.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

హెచ్. వి. కృష్ణా కంపెనీ కార్య క్రమంలో నిమగ్నమయ్యేవారు. ఒంగోలుకు వచ్చిన కృష్ణయ్యగారిక్కడ ప్రత్యక్షమయ్యారు. నాకు ఆంధ్రపత్రిక కార్యాలయంలో ప్రూఫ్‌రీడింగ్ నేర్పిన శ్రీ రాఘవయ్యగారు వీరి జనకులు. పైకంపెనీలో భాగస్వాములు ముగ్గురు. ఒకరు హరిసర్వోత్తమరావుగారు, రెండవ వారు చిలుకూరి వీరభద్రరావు గారు, మూడవవారు కృష్ణయ్యగారు. ఈ కంపెనీ విజ్ఞాన చంద్రిక ప్రచురణల అచ్చుపని బాధ్యత, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ప్రచురణ బాధ్యత, తెలుగు దేశంలోని రచయితల రచనలను వెలుగులోనికి తీసుకొని వచ్చుటకు సాయపడుట వంటి బృహత్తరమైన బాధ్యతలను యీ త్రిమూర్తులు స్థాపించిన కంపేనీ చేపట్టినది. వ్రాతప్రతుల పరిశీలన, సవరణ బాధ్యతలను శ్రీ రాఘవయ్యగారు నిర్వహించేవారు.

తాత ముత్తాతల నాటినుండి శ్రీహరి సర్వోత్తమరావుగారి కుటుంబ సభ్యులు లక్ష్మీదేవి అనుగ్రహానికి నోచుకున్నవారు కాదు. వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రను ప్రప్రథమంగా వ్రాసిన సుప్రసిద్ధ చరిత్రకారులు. వీరు కూడ పేదరికంలో నున్నవారే. రాజమహేంద్రవంలో వుంటూ అక్కడనుండి యీ కంపెనీ కార్యకలాపాలకు సహాయపడుతూవుండేవారు. శ్రీ చతుర్వేదుల కృష్ణయగారు సేవాప్రియులు, ఉత్సాహవంతులు, స్నేహశీలి. లక్ష్మణరావు గారి కలలనుకార్యరూపానికి తెచ్చిన కర్మయోగి, నిరంతర శ్రమజీవులు, పితృభక్తి పరాయణులు. వీరు తండ్రి గారి సహాయంతో తర్వాత కొంతకాలానికి నెల్లూరు సమీపంలోని పల్లెపాడులో సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించి దానిని సమర్ధవంతంగా నిర్వహించిన కార్యదక్షులు. దీనికి పిమ్మట శ్రీ కృష్ణయ్యగారు అరవిందుల అంతే వాసియైనారు. ఆ మహాయోగి రచనలను ఓం ప్రథమంగా తెలుగులోనికి తీసికొని వచ్చిన మహాభాగ్యం వీరికి దక్కింది.

రావుగారు ఉదయం 8 గంటలకే కాగితాల కట్టలు ముందుంచుకొని ఏమేమో వ్రాస్తూ వుండడం, నేను మదరాసుకు వెళ్లిన మొదటిరోజే గమనించాను. ఆంధ్ర పత్రిక కార్యాలయంలో దాదాపు 8 గంటలు పనిచేసేవారు. అది బండచాకిరి. ఆనాటి పరిస్థితులను పట్టి పాఠకులకు ఏ విషయం ఆకర్షణీయంగా వుంటుందో ఆలోచించుకొని 2 కాలములు ప్రతిరోజూ సంపాదకీయం వ్రాయాలి. నిత్యమూ పత్రిక కార్యాలయానికిచేరే ఉత్తరాల కట్టల సంగతి చెప్పవలసిన పనిలేదు. వీటన్నిటినీ స్వయంగా చదివి అవసరమైన వాటికి జవాబు లివ్వాలి. ఈ పనిని యితరులకు పురమాయించకుండాతామే నిర్వహించడం, మధ్య మధ్య శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిని కలుసుకొని సంప్రదించడం, ఆనాడు పత్రిక కార్యాలయానికి చేరిన తెలుగు, ఇంగ్లీషు, కన్నడ, తమిళ, మరాఠీ వగైరా భాషలలోని పత్రికలను తిరుగవేయటం వీటన్నిటినుండి యెన్నిక చేసిన వార్తలు వగైరాలననువదించటం – ఈ పను

నిర్వహణలో వారిఓపిక యింతా అంతా కాదు.

ఆఫీసునుండి యింటికి చేరిన తర్వాత హెచ్.వి. కృష్ణ కంపెనీ కార్య కలాపాలలో నిమగ్నమై లోకాన్ని మరచి పోయేవారు. విసుగు, విరామం, కొంత మందికి ఉండదన్న విషయం శ్రీ సర్వోత్తమరావుగారిలో మనం ప్రత్య క్షంగా చూడవచ్చు. భార్య అనారో గ్యంగా ఉన్నప్పుడు ఇంటిపనుల బాధ్యత కూడ స్వీకరించేవారు. ఈ పనులకు తోడు వారికి నిత్యమూ పోలీ సుల గొడవ ఒకటుండేది. రాత్రివేళ లలో ఒక కానిస్టేబుల్ ఆయనను వేయి కండ్లతో కనిపెట్టి వుండేవాడు. పగలు మరొక పోలీసు యీ డ్యూటీ నిర్వహించే వాడు. వారెక్కడకు వెళ్ళినా నీడవలె యితడాయన వెంట పోవలసినదే. వారిని చూడవచ్చినవారి పేర్లు నాతడు డయరీలో వ్రాసుకొంటాడు. వీటిని శ్రీ రావుగారు లక్ష్యపెట్టే వారు కాదు. అయితే క్రొత్తవారు వీరిని కలుసుకొన డానికి భయపడుతూ వుండడం నేను గమనించాను. ఈ సందర్భంలో ఒక పర్యాయం వారు "కారాగారవాసం ఒక యెత్తు ఈ గూఢచారుల బెడద ఒక యెత్తు" అన్నారు. సహనశీలంతో దీనిని క్ష్యం చేసేవారు కాదు. మొదటి ప్రపంచ యుద్ధం నడుస్తున్నంతకాలం వారిపై ఈ పోలీసుల నిఘా వదలలేదు. తర్వాత ప్రభుత్వ దృష్టి మారడంతో వారి బెడద తప్పింది.

ఆంధ్రపత్రిక సంపాదకులుగ రావు గారు సంపాదించిన వేతనం చాలా స్వల్పమనే చెప్పాలి. హెచ్. వి. కృష్ణ కంపెనీ ఆర్థికంగా దెబ్బతిన్నది. దీనితో దానిని కట్టివేయవలసి వచ్చింది. అయి నప్పటికీ వారు నిరుత్సాహపడలేదు.

పుట్టుకతోనే ఆయన పెద్దమ్మ ప్రియ పుత్రుడు. చిన్నమ్మ కెప్పుడూ ఆయ నపై చిన్నచూపే! అయినప్పటికీ యీ యిద్దరినీ సమదృష్టితో చూస్తూవుండే వారు. ఒకరి క్రింద పనిచేయడం వారికి రుచించలేదు. స్వయంకృషి ద్వారా జీవయాత్ర సాగించటానికీ నిశ్చయించు కొన్నారు. ఆ రోజులలో నేను వారి అతిథిగా వున్నాను. దరిద్రదేవత వారిని పెట్టే యాతనలను ప్రత్యక్షంగా చూచాను. అవి హోంరూల్ లీగ్ రోజులు. నేనప్పుడు చదువుసంధ్యలకు స్వస్తిచెప్పి దీని కార్యకలాపాలలో పాల్గొంటూ వుండేవాణ్ణి. ఇది 1916-17 సంవత్సరాల మధ్య జరిగినది. అనిబిసెంట్, ఆమె సహచరులు దేశం లో గొప్ప ప్రచారంచేస్తూ వుండేవారు. నేనప్పుడప్పుడు మదరాసుకు వెళ్ళి రోజుల పర్యంతం రావుగారి అతిథిగ వుండి, ఆ రోజులలో వారెదుర్కొం టున్న బాధలను ప్రత్యక్షంగా చూచిన సందర్భాలెన్నో వున్నవి.

అప్పుడు నాకొక ఆలోచన తట్టింది. హోంరూల్ ఉద్యమ నిర్వాహకులకు శ్రీ రావుగారిని పరిచయంచేసి, వీరిసేవ లను వారు వుపయోగించుకొనేటట్లు చేయడం బాగుంటుందనుకొన్నాను. శ్రీ జి. యస్. ఆరండేల్ ఆ రోజులలో

హొంరూల్ లీగుకు కార్యదర్శిగా వున్నారు. నేను వారి రచనలు చదివి, వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించాను. ఈ పరిచయంతో ఒకనాడు శ్రీ అరండేల్‌ను కలుసుకొని, రావుగారి దేశసేవను గురించి వారికి చెప్పి, లీగ్ పనులకు వారి నుపయోగించుకొనడం మంచిదని సూచించాను. లీగ్ పక్షాన తెలుగుదేశంలో ఒక కార్యకర్తను నియమించుటకు నిర్ణయించి శ్రీరావుగారికీ అవకాశం వారు కల్పించారు. అది ఆనాడు వారికెంతో సాయపడింది. దీని మూలంగా అవకాశం లభించినప్పుడంతా వారు తెలుగుదేశం నలుమూలలా సంచారంచేసి అక్కడి పెద్దలను, పిన్నలను కలుసుకొనడానికి వీలు కలిగింది.

* * *

మదరాసునుండి నేను మా గ్రామం చేరుకున్న తర్వాత నా ధ్యాస గ్రంథాలయోద్యమం వైపుకు మరలింది. మా వూరిలో అప్పుడున్న క్లబ్బుకు అనుబంధంగా రీడింగ్‌రూమ్‌ను స్థాపించారు. దీని నిర్వాహకులు మేము ప్రారంభించిన గ్రంథాలయానికి తోడుపడినారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారితో మేము సంబంధం యేర్పాటు చేసుకొన్నాం. చుట్టుపట్ల గ్రామాలలో గ్రంథాలయాల స్థాపనకు పూనుకొన్నాము. పెళ్ళూరు అనే గ్రామంలో విజ్ఞానచంద్రిక స్థాపకులు శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారిని గౌరవించే తలంపుతో ఒక గ్రంథాలయాన్ని స్థాపించాము. చీమకుర్తిలోని మిత్రులను ప్రోత్సహించి అక్కడ మరొక గ్రంథాలయాన్ని నెలకొల్పుటకు పూనుకొన్నాము. దీనిని సర్వోత్తమరావుగారి పేరట వారి త్యాగానికి, దేశాభిమానికి చిహ్నంగా ఏర్పాటు చేయాలనుకొన్నాము. దీనిని ప్రారంభించుటకు హరి సర్వోత్తమరావుగారిని ఆహ్వానించినాము. వారు మా కోరికను మన్నించి ఒంగోలుకు వచ్చినారు. మేము స్టేషనుకు వెళ్ళి వారిని శ్రీ నరసింహం పంతులుగారి యింటికి తీసుకొని వచ్చినాము. శ్రీ రావుగారి కోరిక మేరకు ఒంటెద్దు బండిలో వారిని చీమకుర్తికి తీసుకొని పోయినాము.

చీమకుర్తిలో భోజనాల సమయంలో వారన్నమాటలు నేను మరువజాలను. "శర్మా నీకు కావలసినమట్టుకే పెట్టించుకో. అన్నం వదలిపెట్టకు, మనది పేదదేశం, ఏ యిద్దరు ముగ్గురో కలవారికితప్ప నిత్యమూ పట్టెడన్నమునకు మన ప్రజలు నోచుకోలేదు. కనుక అవసరంలేదని వడ్డించిన పదార్థాలను విడిచిపెట్టకు. ఇది మా తాత ముత్తాతలు నేర్పిన ధర్మం." ఈ కాలంలో అది మనం మరచినాము. నిరుపేదల బాధలను గమనించకుండా స్వప్రయోజనాల సాధనకు కృషి చేస్తూ, పరమపద సోపానాన్ని అధిష్టించేందుకు ప్రయత్నం చేస్తూంటాం.

హరి సర్వోత్తమరావుగారిని ఇంటిలో కలుసుకొన్నా, ఆఫీసులో చూచినా, వారితో ప్రయాణం చేసే అదృష్టం కలిగినా, ఆయన జీవితం యే త్రోవకు చెందిందో సులభంగా అర్థం చేసుకో

గలం. ఇంతెందుకు, వారి సన్నిధిలో వుండే ప్రతిక్షణంలోను వారి జీవితా దర్శం అద్దంలో ముఖంవలె మనకు దర్శనమిస్తుంది.

మదరాసులో నేను వారి అతిథిగా వున్నప్పుడు తెలుసుకొన్న దానికన్న ఎన్నో రెట్లు ఒంగోలునుండి చీమకుర్తికి ఒంటెద్దు బండిలో ప్రయాణం చేసినప్పుడు తెలుసుకో గలిగినాను. ఈ సమయంలో వారు చెప్పిన విషయాలు, వారి నిర్మలమైన అంతఃకరణను ప్రస్ఫుటం చేసినవి. వారి మాటలు కేవల విజ్ఞాన దాయకాలు మాత్రమే కాదు. మనమే విధముగా మెలగవలెనో, మన జీవితాల నెలా సార్థకము చేసుకొననగునో వివరించునట్టివి. మనలో ధైర్య సాహసాలను పురికొల్ప సమర్థమైనవి. ఈ మా ప్రయాణం కాశీ యాత్ర వంటిది. పూట పట్టినది. ఈ సమయంలో వారు మాకు తమజీవితానుభవాల నెన్నింటినో తెలిపి మమ్ము తన్మయులను చేసినారు.

పై ప్రయాణం ఒకయెత్తు చీమకుర్తికి చేరుకొన్న తర్వాత అ గ్రామాన్ని దర్శించుటకు వారుచూపిన ఆసక్తి మరియొక యెత్తు. వారి జన్మస్థానమైన రాయలసీమకు, మా ప్రాంతానికి పరిస్థితిలో తేడా కన్పించకపోవడంతో వారాశ్చర్యం వెల్లడించారు. తమ సీమలోని దారిద్ర్యం మా ప్రాంతంలో కూడా ప్రత్యక్షం కావడంతో వారు చాలా విచారించారు.

నాటి సాయంత్రం గ్రామస్థులు పెద్ద యెత్తున ఆతిథ్యమిచ్చారు. ఈ ఉత్సవానికి చుట్టుపట్ల గ్రామాల ప్రజలు కూడ హాజరైనారు. గ్రంథాలయాలు దేశసేవకు నడుం కట్టుకున్నాయని, మనం యిరుగుపొరుగు వారి యోగక్షేమాల నిమిత్తం దీక్షతో పనిచేయాలని, ఇదే నిజమైన సేవ యని, దీని ద్వారానే మన దేశాన్ని రామరాజ్యంగా మార్చవచ్చునని ఉద్ఘాటిస్తూ, రెండుగంటలకుపైగా ఉపన్యసించారు. వారి మాటలు వింటూ, వారిని తదేక దృష్టితో చూస్తూ అక్కడి జనం మైమరచి యున్నస్థితి బ్రహ్మాండమైన రంగుల చిత్రం. అది యిప్పటికి కూడా కండ్లకు కట్టినట్టు నాకు కనబడుతున్నది.

ఆరోజులలోనే మదనపల్లిలో జాతీయవిశ్వవిద్యాలయం నెలకొనడం, నేను నా గ్రంథాలయ సేవకు స్వస్తి చెప్పి తిన్నగా మదనపల్లికి పోవడం జరిగింది. అక్కడికి కూడ అప్పుడప్పుడు రావుగారు రావడం, మా మధ్య నాలుగైదు రోజులు గడపడం ఉండేది.

నావిద్యార్థిదశ ముగిసినపిదప ఎనిమిది సంవత్సరాలు విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఆదర్శ గురుకులంలో సేవచేసే భాగ్యం నాకు లభించింది. ఆ రోజులలో రావుగారు కర్నూలులో వుండేవారు. మదరాసుకు పనిపై వచ్చినప్పుడంతా వారు మా విద్యాలయాన్ని దర్శించి, గంటల తరబడి ఇష్టాగోష్టి జరిపేవారు.

**సౌజన్యం : 'వందేమాతరం'**
(గాడిచెర్ల శతజయంతి సంచిక)



# ముఖ చిత్రం



The woods are lovely, dark
and dee
But I have promises to keep
And miles to go before I sleep.
And miles to go before I sleep.
— Robert Frost

(నెహ్రూ స్వదస్తూరితో వ్రాసి పెట్టుకున్న పలుకులు)

చరిత్ర పుటలలో సువర్ణదీప్తులు వెదజల్లి తమ పుణ్యజీవితం సమస్త మానవాళికి ఆశాదీపం కాగల జవహర్ లాల్ నెహ్రూ వంటి మహనీయులు చాలా అరుదుగా జన్మిస్తూంటారు. ఆనాటి బుద్ధుని వెనుక జన్మించిన అశోకుని వలే, ఈనాడు గాంధీ వారసునిగా, బాపూజీ కలలుగన్న శాంతి, అహింస లను క్రియారూపాన రాజనీతిలో, పరిపాలనాదక్షతలో, ప్రపంచ వ్యవహారా లలో కనబరచి, సభ్య మానవాళిలో మహానాయకునిగా ప్రజాహృదయాధిపతిగా భాసిల్లాడు నెహ్రూ. ఎంతటి నైరాశ్యతలోను జీవస్పందనగా ఎంచిన సిద్ధాంతాలను విడనాడకుండా, చిరునవ్వుని చెదరనీయకుండా వచోధారల ద్వారా హృదయ కుసుమ పరిమళం వెదజల్లుతూ, అల్పత్వంలోను అజ్ఞానం లోను క్రమ్గుతున్న ఈ భారతజాతిని, సువిశాల భారతదేశాన్ని స్వహస్తాలతో లేవనెత్తి నాగరిక ప్రపంచములో మన ఆత్మ గౌరవాన్ని నిలబెట్టిన మేరునగ ధీరుడు నెహ్రూజీ. ఏభై సంవత్సరాల పాటు భారతీయుల భవిష్యత్తుని తన భుజస్కంధాలపై మోసి, మనసూ మెదడూ ఉత్సాహంతో ముందుకు వురుకులెత్తుతున్నా ఈ పాంచభౌతిక కాయం అలసిపోవటంవల్ల పుణ్యభూము లకు మళ్ళి పోయాడు ఈ పూర్ణజీవి.

* * *

కాశ్మీరులో జన్మించిన నెహ్రూ పూర్వీకులు 1716లో ఢిల్లీ నగరానికి వలస వచ్చారు. సంస్కృత పర్షియన్ భాషలలో పండితుడైన రాజ్‌కౌల్ మొగలాయి సమ్రాట్ వద్ద రాజోద్యోగం చేస్తూండేవాడు. వీరిజాగీరు ఒక కాలువ పక్కగా వుండటంచేత, కౌల్ కుటుంబ నామధేయం హిందూస్థానీలో 'నహర్' గా, ఆపైన నెహ్రూగా మారింది. మోతీలాల్ నెహ్రూ తాతగారు ఈస్ట్ ఇండియా కంపెనీ (సర్కారి కంపెనీ) లోవకీలుగా వుంటూ వుండేవాడు. 1857 ప్రథమ భారతవిప్లవంనాటికి, మోతీలాల్ నెహ్రూ తండ్రి, అనగా జవహర్‌లాల్ తాత గారు, ఢిల్లీ పట్నానికి కొత్వాల్‌గా వుండేవారు. అప్పట్లో వీరి కుటుంబము ఆగ్రాకు మారారు.

ఆగ్రాలో 1861 మే 6 తేదీన మోతీలాల్ జన్మించారు. సరిగా అదే రోజున భారతమాత మరొక రత్నాన్ని కన్నది– రవీంద్రనాథ్ టాగూర్.

సారస్వత రంగంలో రవీంద్రులు, రాజకీయ రంగంలో మోతీలాల్ నిరుపమకృషి జరిపి, ఈ నిద్రాణ జాతిని తట్టిలేపుతూ, మానవులందరు

ఒకటేనని పాశ్చాత్య పౌర్వాత్య విభేదాలు, మూర్ఖచిత్తుల తాత్కాలికోన్మాదమనీ నాగరిక ప్రపంచాన్ని ఉద్దేశిస్తూ ఎలుగెత్తి చాటారు. దక్షిణాఫ్రికాలో జాతి వివక్షణ విధానాన్ని కళ్ళారా చూసి, దాని దుష్ఫలితాలు స్వయంగా తెలుసుకున్న గాంధీజీ ఆంగ్లపాలకులలో ఆత్మపరివర్తన తీసుకురాగలిగితే తప్ప, ఈ అన్యాయాలు అంతరించవని అసహాయోద్యమ శంఖం పూరించారు; సత్యం, అహింస చక్రాయుధ వజ్రాయుధాలుగా ధరించి రాజకీయ రథసారథ్యం వహించారు. తనకంటె పెద్దవాడైన మోతీలాల్ నెహ్రూపై భక్తి గౌరవాలు కనబరుస్తూ, తనకంటే చిన్నవాని జవహర్ లాల్‌ను తన స్వప్న సౌభాగ్యానికి పట్టుగొమ్మగా తలపోశాడు. తన కలలన్నీ ఈ తేజో రాసి ద్వారా తీరుతాయని తెలుసు గాంధీజీకి.

* * *

జవహరుని మొదటి ట్యూటర్ బ్రూక్స్. ఆయన విద్యాశిక్షణలోనే గ్రంథ పఠనాసక్తి పెరిగింది. పది పధ్నాలుగేళ్ళ వయసు నాటికే డికెన్సు, థాకరే, వెల్స్, మార్క్‌ట్వేన్ మొదలైన వారి గ్రంథాలు, మన భారత రామాయణాదులూ చదవడమే గాక అనిబిసెంట్ దివ్యజ్ఞాన తత్వంపై దృష్టి పోనిచ్చారు జవహర్. పాశ్చాత్యులకు మాత్రమే అనుకేటాయింపు రైలుపెట్టెలలోను, పార్కు బెంచీల వద్ద కనబడుతూ వుండేది. పన్నెండేళ్ళు నిండని బాలునికి, యిది దురన్యాయంగా కనిపించి రక్తం కుతకుతలాడేది.

ఆనాటి సంపన్న కుటుంబీకుల ఆచారం ప్రకారం మోతీలాల్ 1905 లో తన కుమారుని యింగ్లండు తీసుకువెళ్ళి హారో విద్యాలయంలో చేర్పించాడు. అక్కడ రెండేళ్ళు చదువు అయినాక బ్రిటీష్ ప్రధాన మంత్రుల ఆరంభ విద్యా మందిర మనదగు కేంబ్రిడ్జ్ ట్రినిటీ కాలేజీలో ప్రవేశించాడు జవహర్. లోక వ్యవహారాలు, ప్రపంచ రాజకీయాలు ఆకళింపు చేసుకుంటున్న తనయునికి, ఆనాడు తండ్రి వ్రాసిన లేఖలు, లేఖా సారస్వతంలోని మణిపూసలు అనవచ్చు. అభిమన్యునికి అర్జనుడు పద్మవ్యూహ రహస్యం సగము దాకా చెప్పగలిగాడు. కాని యిక్కడ అటువంటిదేమీ జరగలేదు. తండ్రి, తన కుమారుని మనోవికాశానికి ఆత్మధృతికి తన వివేకానుభవంతో తగు దోహదమిస్తూ, అతనిని ఒక విశిష్ట వ్యక్తిగా తీర్చిదిద్దాడు. ఈ తండ్రీ కొడుకుల మైత్రీలత గురుశిష్య బాంధవ్యాన్ని మించినది. కుమారుని తనంత వాణ్ణి చేయడమేగాక, తను తన జీవిత కాలంలో సాధించలేక పోయినవి, జవహర్‌లాల్ నెరవేర్చ గలడనే నమ్మకం వుండేది మోతీలాల్‌కి. ఏ తండ్రికైనా అంతకంటే ఏం కావాలి?

అంతటి పితృవాత్సల్య ప్రేమానురాగాల మధ్య, సిరిసంపదలతో విద్యా వినయ భూషణాలతో, వ్యక్తి స్వాతంత్ర్యమూ ప్రజా స్వాతంత్ర్యమూ మానవ మనుగడకు ప్రధానములనే గాఢ విశ్వాసంతో పెరిగిన జవహర్, 1912లో భారతదేశానికి వచ్చాడు.

అప్పుడప్పుడే యూరప్‌లో వైమానిక శకం ప్రారంభమవుతోంది. పారిస్ లోని ఈఫిల్ టవర్ చుట్టు విమానం తిరగడం చూశాడు జవహర్.

1912 లో ఇండియాకు వచ్చిన జవహర్, ఆ సంవత్సరం బంకిపూర్ లో జరుగుతున్న కాంగ్రెస్ మహాసభకు ప్రతినిధిగా హాజరయాడు. అప్పటి కింకా ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ధనవంతుల చర్చావేదిక. మడత నల గని సూట్లలో వచ్చేవారు చాలామంది. దక్షిణాఫ్రికా నుంచి అప్పుడే వచ్చిన గోఖలే ప్రసంగం తప్ప, మిగతాదంతా చొప్పదంటుగా తోచింది జవహర్‌కు.

1916 వసంత పంచమినాడు జవహర్‌లాల్ కమలల వివాహం జరిగింది. మరుసటి సంవత్సరం ఇందిరా ప్రియదర్శిని జన్మించింది. కమలానెహ్రూ ఆరోగ్యం మొదటినుంచి అంతంత మాత్రంగానే వుండేది. అందుకు తోడు స్వాతంత్ర్య సమరమూ అస్థిమిత పరిస్థితులూ ఆమె వ్యాన్ని మరింత పెంచి, చివరకు ప్రాణాలనే బలి గొన్నాయి. ఎంతటి కష్టంలోను ధృతి చెడని ధీరవనిత కమలా నెహ్రూ. లోక దృష్టిని పడకుండా అతిగోప్యంగా, ఆమె అస్థికల పాత్రను మూడు దశాబ్దాలపాటు దాచి వుంచారంటే, అది జవహర్ పండితునికి అమెపై గల గౌరవానికి, మ హ దా ను రా గా ని కి తార్కాణం.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో అనిబెసెంటు హోమ్‌రూల్ ఆందోళన ప్రారంభించారు. ఆమెను అరెస్టు చేయడంతో మితవాదులలో కూడా సంచలనం కలిగింది. 1919 నాటి రౌలత్ చట్టమూ, ఖిలాఫత్ ఉద్యమమూ భారత రాజకీయాలలో గాంధీశకాన్ని ప్రవేశ పెట్టాయి. ప్రజలకు హాని చేసే రెండు బిల్లుల విషయంలోను, అమోదం నిరాకరించకపోతే తను సత్యాగ్రహం ప్రారంభించవలసి వుంటుందని వైస్రాయ్‌కి లేఖ వ్రాశారు గాంధీజీ. ఉగాది ఉత్సవంలోని 20,000 మంది నోరులేని ప్రజలపై ఘాతుకంగా తుపాకిలు పేల్చి 379 మందిని చంపి, 1200 మందిని తీవ్ర గాయాలకు గురిచేసిన జనరల్ డయ్యర్ జలియన్‌వాలా బాగ్ దురంతంతో భరత ధాత్రి దద్దరిల్లింది. ఆ సైనికుల వద్ద గల తుపాకులలోని తూటాలు అయిపోయాయట గాని లేకపోతే యింకా కాల్చివుందురట.

కాంగ్రెస్ సంస్థ మోతీలాల్‌నెహ్రూ, చిత్తరంజన్ దాసులతో విచారణ సంఘం ఏర్పరిచి, ఒక నివేదికను తయారు చేయమన్నారు. జవహర్‌లాల్, చిత్తరంజన దాసుతో అమృతసర్‌కు వెళ్ళి, సమాచార సేకరణలో, తన తండ్రిగారి ప్రాణమిత్రుడైన దాసు మెప్పుని పొందగలిగాడు.

1919 నాటి అమృతసర్ కాంగ్రెస్ మహాసభకు మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షుడు. భారతరాజకీయాలపై గాంధీజీ ప్రభావం నెమ్మది నెమ్మదిగా పడుతోంది. 1920 లో ముస్సోరీలోని ఒక విశ్రాంతి భవనంలో తన కుటుంబంతో వుంటున్నప్పుడు జవహర్ మొదటి

సారిగా బ్రిటిష్ ప్రభువులు, తమ పాలిత ప్రజలపై చూపే 'జులుమ్' తెలుసుకున్నాడు. వీరు వుంటున్న హెూటల్‌లోనే ఆఫ్గన్ ప్రతినిధి వర్గం వారు బస చేయనున్నారు. ఈ ప్రతి నిధి వర్గ సభ్యులకు జవహర్‌లాల్‌తో పరిచయ మేర్పడటం అధికారులకు యిష్టంలేని కారణాన, యితను అలహా బాదు వచ్చేయ్యాల్సి వచ్చింది. అప్పుడే మొదటిసారిగా చూశాడు ఈ దేశపు బీదరైతులని, వారి దీనావస్థని.

1921 లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం, విదేశి వస్తు బహిష్కరణ ప్రారంభించాడు. మొత్తం 30 వేలమంది జైళ్ళకు వెళ్ళారు. జవహర్ లాల్‌ని అలహాబాదులో అరెస్టు చేసి ఆరునెలలు ఖైదు విధించారు. చౌరి చౌరా గ్రామంలో తల యెత్తిన దౌర్జన్య కాండ ఫలితంగా గాంధీగారు ఉద్యమాన్ని ఆపివేశారు. కాని, మొదటి ఆరు నెలల శిక్ష అనంతరం ఆరువారాలు మాత్రమే వెలుపలవున్నాడు జవహర్. విదేశీబట్టల షాపు వద్ద పికెటింగ్ చేసిన నేరానికి గాను మళ్ళీ అరెస్టుచేసి ఈసారి ఒక సంవత్సరం తొమ్మిది నెలలు శిక్ష విధించారు. 1923 జనవరిలో, కాంగ్రెస్ నీరసస్థితిలో వున్నదని తెలిసినమీదట, జవహర్‌ని విడుదల చేశారు.

ఇలా వుండగా, చిత్తరంజన్‌దాసు లకత్తాలోను, జవహర్ అలహాబాదుకను, విఠల్‌బాయ్ పటేల్ బొంబయిలోను, వల్లభాయి పటేల్ అహమ్మదాబాదులోను ఆయాపురపాలక సంఘాలకు అధ్యక్షులవడం జరిగింది. .... నాభా సంస్థానంలో జరుగుతున్న ఆందోళన ఏమిటో చూదామని పరిశీలనా దృష్టితో వెళ్ళిన జవహర్‌లాల్‌ని, కె. సంతానమ్‌ని ఆ సంస్థానాధికారులు బంధించి, బేడిలు వేసి, ఒక రాత్రి జైలు కొట్లో వుంచి, మర్నాడు న్యాయ విచారణ అనే తంతు జరిపి, రెండేళ్ళ శిక్ష విధించి, ఆ సాయంత్రమే శిక్షను రద్దు చేసి, తమ సంస్థానం వదిలి పొమ్మన్నారు. స్వదేశసంస్థానాధీశుల ఘనతకు నాభా ఉదంతం ఒక మచ్చుతునక. మన దేశ సంపద దోచుకున్నది చాలక, యిటువంటి ప్రాచీన హాస్యగాళ్ళతో రౌండుటేబులు సమావేశం జరిపించింది బ్రిటిష్ ప్రభుత్వం.

* * *

జవహర్ మనసుని ఏవో నిరాశలు కుంగ దీస్తున్నాయి. ఈ ప్రాక్పశ్చిమాలలో తను దేనికి చెందుతాడో తెలియకుండా వుంది. ఈ పదమూడేళ్ళలో జరిగిన మార్పులు చూదామనీ మన శ్శాంతి లభిస్తుందనీ 1926 మార్చిలో యూరప్‌కి ప్రయాణమయ్యాడు. భారత విప్లవ వీరులైన కృష్ణవర్మ, మహేంద్ర ప్రతాప్, మాడమ్ కామా, వీరేంద్ర చటోపాధ్యాయ, ఎమ్. ఎన్. రాయ్ ప్రభృతులని యూరప్‌లో వుండగా కలుసుకున్నాడు.

1927లో బ్రసెల్స్ నగరంలో జరిగిన పీడిత జాతుల సమావేశానికి హాజరయాడు. ఈ యూరప్ పర్యటన ఆయన కొక విధంగా నూతనోత్తేజాన్ని కలిగించింది. ప్రజా ఉద్యమంలో

చెరగదు పెదవుల చిరునవ్వుల సిరి
జారవు మొగమున సౌమ్యచ్ఛాయలు
—రాయప్రోలు



గంధపు చెక్కలలో నీ కనక ప్రభలే తోచెను
చితిమంటల లోపల నీ చిరునవ్వులు విరబూచెను
-నారాయణ రెడ్డి

ఉ[ద్రేకులెందరు ? ఆలోచనాపరులెందరు? ప్రతి సిద్ధాంతమూ అనేక వ్యాఖ్యానాలతో కార్యాచరణలో ఎన్ని మెలికలు తీసుకుంటుంది? రష్యాలో రక్తపాతంతో తలయెత్తిన కమ్యూనిజమూ, దాని పరిణామాలు, పురోగమించిన దేశమనుకున్న ఇంగ్లాండులోని 'జనరల్ స్ట్రయిక్' విఫలమవడమూ, ఐరోపా దేశాలలోని అశాంతి, వలస విధాన ఫలితంగా ఏర్పడుతున్న యిక్కట్లు, యివన్నీ జవహర్‌ని స్వదేశం వైపు, శీఘ్ర గతిని మళ్ళించాయి.

తనను అధ్యక్షునిగా వుండమని కాంగ్రెసు మహాసభవారు కోరుతుండగా, "నేను కాదు - అధ్యక్షుడు కాదగ్గవాడు జవహర్‌లాల్. ధైర్య సాహసాల్లోను, దేశభక్తిలోను అతనికి దీటైనవారు మరొకరు లేరు. రాజపుత్ర వీరుని శౌర్యముతో పాటు, రాజనీతిజ్ఞుని సౌమ్యత అతనిలో మూర్తీభవించింది. అతని ఆలోచనా గరిమ దుడుకుగాను, విప్లవోద్దీపనతోను ఉండవచ్చుగాని, చుట్టూ పరిసరాలను అధిగమిస్తూ కడుదూరం చూడగల సమర్ధుడతను. స్ఫటికము వలె ప్రకాశించే ఈ నిర్మలాంత రంగుని హస్తాలలో మన దేశ భవితవ్యాన్ని ఎట్టి సంకోచమూ లేకుండా వుంచవచ్చు" అన్నారు గాంధీజీ - 1 9 2 9 లో లాహోరు కాంగ్రెసు ముందు. ఆనాడే బాపూజీ తన వారసుణ్ణి నిర్ణయించేశారు.

1929 కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రవేశ పెట్టే నాటికే, భారతజాతి భవిష్యత్తు జవహర్ భుజాలపై పడింది. తండ్రిని మించిన కొడుకైనందుకు మోతీలాల్ ఆనందం పట్టలేక పోయాడు. ఈ రెండు తరాలకు వంతెన బాపూజీ.

సూచన ప్రాయంగా శాసనధిక్కారం జరపదలుచుకున్న గాంధిజీ, దండి సత్యాగ్రహంలో ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు. దేశమంతటా "ఉప్పోయమ్మ, ఉప్పు" అన్నారు. త్యాగనిరతి పెల్లుబికింది. సత్యాగ్రహోద్యమం అతి ప్రశాంతంగా సాగిపోతున్నది. విహార భూములకు వెళ్తున్నట్లుగా జైళ్ళకి వెళ్తున్నారు.

1932 జనవరి చివరివారంలో ప్రభుత్వం జవహర్‌లాల్‌ని అమాంతం విడుదల చేసింది. అందుకు కారణం లేకపోలేదు. మోతీలాల్ అవసాన దశలోవున్నాడు. బలదర్పంతో సామ్రాజ్యాన్ని కాపాడుకునేందుకు నానా అగచాట్లు పడుతున్న బ్రిటిష్ ప్రభుత్వం, చివర పది పన్నెండు రోజులైనా తండ్రీ కొడుకులను ఒకచోట ఉండనిచ్చింది. వయః పరిపాకంతో ఆ గాయపడ్డ సింహం, 1932 ఫిబ్రవరి 6వ తేదీన కన్ను మూసింది. మార్చి 4వ తేదీన గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరగడంతో, సహాయ నిరాకరణోద్యమం నిలిపివేశారు.

రెండవ రౌండ్‌టేబుల్ సమావేశానికి వెళ్ళిన గాంధీజీ విఫలమనోరథుడై తిరిగిరావడంతో, పాలకుల పశుబలంతో ఈ ప్రజా ఉద్యమాన్ని అణిచివేయడానికి పూనుకున్నారు. తెల్లదొరల

మెప్పుకోసం పోలీసు అధికారులు విజృంభించసాగారు. గాంధిజీ ఓడ దిగడానికి పూర్వమే నెహ్రూ ప్రభృతులని అరెస్టు చేసింది ప్రభుత్వం. ఈసారి జవహర్‌కు రెండున్నరసంవత్సరాలు శిక్ష విధించారు. శిక్షా పరిమితి ఇంచుమించు అయిపోతూ వుండగా 1933 ఆగస్టు 30వ తేదీన, తల్లికి చాలా జబ్బుగావున్న కారణాన, విడుదల చేశారు. అయిదున్నర నెలలు వెలుపల వుండనిచ్చి, మళ్లీ జైలులో పెట్టారు. కనిపెంచినతల్లిపక్షవాతంతో బాధపడుతుండగా, జవహర్ ఆలీపూర్, డెహ్రాడూన్ జైళ్ళమధ్య రోజులు వెళ్ళబుచ్చవలసి వచ్చింది.

1935 సెప్టెంబరులో, జర్మనీలో చికిత్స పొందుతున్న కమాలానెహ్రూ ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించడంతో, జవహర్‌ని విడుదల చేశారు. వెంటనే ఆయన యూరప్ వెళ్ళారు. 1936 ఫిబ్రవరి 28 న, కమలా నెహ్రూ పరమపదించింది. గాంధీజీ సత్యాగ్రహ సమరాన్ని అప్పటికే నిలుపు చేశారు. కాంగ్రెసు మహాసభ, శాసనసభా ప్రవేశానికి ఆమోదం తెలిపింది. ప్రభుత్వానికీ కాంగ్రెస్‌కీ మధ్య "జెంటిల్‌మేన్స్ అగ్రిమెంట్" ఏర్పడింది. జవహర్‌లాల్‌నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షునిగా సుమారు 50,000 మైళ్ళు,అటు విమానం, ఇటు ఒంటె అన్ని రకాల వాహనాల మీదప్రయాణంచేసి, ఎన్నికలలో కాంగ్రెస్ విజయాన్ని కై కృషి చేశారు.

1937 లో బర్మా, మలయా దేశాలు సందర్శించి స్పెయిన్ అంతర్యుద్ధాన్ని కృష్ణమీనన్‌తో, బార్సిలోనా నగరంలో 5 రోజులపాటు వుండి చూశాడు. స్పెయిన్‌లోని ప్రజాస్వామిక శక్తులని, నియంత ఫ్రాంకో కూలదోస్తూ ఉండగా బ్రిటన్ ఫ్రాన్సులు ఈ విద్రోహకర చర్యలో అతనికి సాయపడటమూ రష్యా ప్రజాస్వామ్య పక్షం వహించడమూ ఆశ్చర్యంగా కనిపించిందా నాడు. కాని, ప్రపంచము రెండవ యుద్ధానికి ఆయత్త మవుతున్నదని గ్రహించేందుకు అది ఒక సూచన.

1939 ఆగష్టులో నెహ్రూ చుంకింగ్ వెళ్ళారు కాని, రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతో తన పర్యటన రద్దుచేసుకుని, వెంటనే ఇండియా చేరుకోవలసిన అగత్యం ఏర్పడింది. అక్షరాజ్యాలకు, మిత్రరాజ్యాలకు మధ్య జరుగుతున్న ఈ యుద్ధంలో భారతదేశం బ్రిటన్‌కు సహాయం చేయాలనీ, ప్రజాస్వామ్యం విజయ మొందకపోతే, మానవుని పవిత్రాశయాలన్నీ మంటగలుస్తాయనీ రాజాజీ, అజాద్, నెహ్రూలు భావించారు. మిగతా అందరూ గాంధిగారి పక్షం వహించారు. సిద్ధాంతాచరణ గాక వ్యక్తి అరాధన కాంగ్రెస్‌లో ప్రబలుతున్నదని అప్పటికే నెహ్రూ పలుమార్లు వెలిబుచ్చాడు. కాని ఏం లాభం? గాంధీగారు, వ్యక్తి సత్యాగ్రహమంటూ ప్రారంభించి, ప్రప్రథమ సత్యాగ్రహిగా తన ఆశ్రమవాసి అయిన వినోబా భావేని పేర్కొని, రెండవ సత్యా

గ్రహిగా నెహ్రూ పేరు సూచించారు. జాతిపిత ఆదేశం శిరసావహించారు నెహ్రూ. న్యాయస్థానంలో నెహ్రూ చెప్పిన సందేశం ప్రజలను భావావేశంలో ముంచింది. నాలుగేళ్ళ జైలు విధించారని తెలియగానే, విన్‌స్టన్ చర్చిల్ వంటివారు సైతం ముక్కుమీద వేలు వేసుకున్నారు.

కాని నాలుగేళ్ల జైలులో వుండవసరం లేకపోయింది. జపాన్‌వారు రంగూన్ పట్నాన్ని ఆక్రమించడంతో ప్రభుత్వం నాయకులందరిని విడుదల చేశారు.

1942 ఫిబ్రవరిలో క్రిప్స్ రాయబారం జరిగింది. 'దివాలాతీయనున్న బాంకుమీద యిచ్చే పోస్టు డేటెడ్ చెక్' అని ఒక్కముక్కతో కొట్టేశాడు గాంధీజీ. 'క్విట్ ఇండియా' తీర్మాన ఫలితంగా మళ్ళీ పెద్దలందరినీ శ్రీకృష్ణ జన్మస్థానానికి పంపింది ప్రభుత్వం. యూరప్‌లో యుద్ధం ముగిశాక వేవెల్ ప్రభువు నాయకులందరినీ విడుదల చేసి సంప్రదింపులు ప్రారంభించారు. ఈలోగా బ్రిటన్‌లో లేబర్ పార్టీ అధికారంలోకి రాగానే పరిస్థితులు కొంచెం మెరుగయాయి. కొత్త ఎన్నికలు ప్రకటించారు. కేంద్రంలో ముస్లిములకని కేటాయించిన ముప్ఫయి సీట్లు ముస్లిమ్ లీగుకి వచ్చాయి. రాష్ట్రాలలోని 489 సీట్లలోను 457 ముస్లిం లీగ్‌కి వచ్చాయి. ఇన్నాళ్లూ కాంగ్రెస్, బయట శత్రువుతో పోరాడుతూ లోపల ఏర్పడుతున్న చీలికలను నిరోధించలేకపోయింది. బొంబయిలో నౌకాశిబ్బంది తిరుగుబాటు, కరాచీలో విమాన సిబ్బంది నిరాహార దీక్ష పాలకులని కలవరపెట్టాయి. క్రిప్స్, పెతిక్ లారెన్స్, అలెగ్జాండర్- ఈ ముగ్గురితో కూడిన మంత్రివర్గ రాయబారం మనదేశం వచ్చి, భారత సమస్యను పరిష్కరించేందుకు నడుం కట్టింది.

కాంగ్రెస్ సభ్యులు వల్లభాయి పటేల్‌ని ఎన్నుకున్నప్పటికీ, గాంధీజీ ఆదేశానుసారం పటేల్ విరమించుకోవడం, నెహ్రూ మూడవ సారి కాంగ్రెస్ ప్రెసిడెంట్ అవడమూ జరిగింది. పటేల్‌కి అప్పటికే 71 సంవత్సరాలు. రాజ్య రథ సారథ్యానికి పటేల్ కంటే పదిహేనేళ్ళ చిన్నవాడైన నెహ్రూ, అన్నివిధాలా అర్హుడు, అని బాపూజీ భావించారు.

రాజ్యాంగ సభ ఏర్పాటు చేయబోగా ముస్లింలీగ్ దానిని బహిష్కరించింది. మార్గాంతరం లేక బ్రిటిష్ ప్రధాని అట్లీ, 1948 జూన్ లోగా బ్రిటిష్ వారు, తమ అధికారాన్ని ఉపసంహరించుకోనున్నారని ప్రకటించారు. ముస్లింలీగు పాలనలో ఉన్న బెంగాలు రాష్ట్రంలో మత కలహాలు ప్రారంభమయాయి. అప్పటికే మతోన్మాద విషపురుగు దేశమంతటా పాకింది. అవిశ్వాసంలోను, అపోహలతోను ప్రారంభమయిన ఈ అత్యాచార కాండ, భారతావనిని రక్తసిక్తం చేసింది. ఈ ఏకఖండాన్ని రెండు ముక్కలుగా

ంది. 'నన్ను రెండుగా కోయండి—

కాని ఈ దేశాన్ని చీల్చవద్దు' అని ఆక్రోశించిన బాపూజీ నిస్పృహాయుడై పోయాడు.

* * *

చీలికలు ఏర్పడి దేశ విభజన జరగడంతో ఆధునిక చరిత్రలో కని విని ఎరుగని అమానుష చర్యలు, దారుణ హింసా కాండలూ అనేకం సంభవించాయి. ఆటవిక తత్వ విజృంభణలో, ఈ రక్తాశ్రువులలో ధృతి చెడక, విశ్వాసము సడల నీయక, ఏకోన్ముఖ గమ్యంతో ప్రభుత్వ రథాన్ని ప్రగతి పథాన నడిపించాడు నెహ్రూ. 1950లో సర్దార్ వల్లభాయి పటేల్ మరణించడంతో, నెహ్రూపై గల భారం మరింత ఎక్కువయింది. 1952 ఎన్నికలలో కాంగ్రెస్‌కి విజయసారథి అయాడు నెహ్రూ. 17 కోట్ల 30 లక్షల మంది ఓటర్లు; 3800 సీట్లకు 17 వేల మంది అభ్యర్థులు. 43 రోజులలో, 30 వేలమైళ్ళు రోజుకి 9 ఉపన్యాసాలు చెబుతూ, పర్యటించాడు. 1957, 1962 లో కూడా అదే రీతిని శ్రమించారు.

భారత భూమిలో వలస విధాన చిహ్నాలు వుండరాదని, 400 ఏళ్ళుగా పోర్చుగీసువారిపాలనలో వున్న గోవాను 1961 లో మాతృదేశంలో కలపడంతో, పాశ్చాత్య ప్రపంచం నెహ్రూని విమర్శింప నారంభించిరది. అరబ్ దేశాలతో గల స్నేహము, రష్యాతో గల మంచితనమూ కొంతలో కొంత అర్థం చేసుకున్నారు గాని, గోవాపై ఈ బలప్రదర్శనకు గల హేతువేమిటన్నారు. 14 ఏళ్ళుగా మన హిత వచనాలు పెడ చెవిని బెట్టినపుడు, దండ నీతి గాక మరొకటేమున్నది అని భావించాడు నెహ్రూ

1962 నవంబరులో చైనా జరిపిన దురాక్రమణ, నెహ్రూ పండితుని ఆశ్చర్య విషాదాలలో ముంచింది. ఇన్నాళ్ళుగా తాము ఐక్యరాజ్య సమితిలో యిచ్చిన మద్దతుకి, చేసిన మేలుకి, యిదా ప్రత్యుపకారం ? ఈ లోపం కృష్ణ మీనన్‌ది కాదు - తనదే నని అంగీకరించినప్పటికీ కాంగ్రెస్ వారు నెహ్రూని వదులుకునేందుకు ఒప్పుకోలేదు.

స్ఫురద్రూపి, నరసవబో రీతి తెలిసిన సద్గుణోపేతుడు, నీలి సాంద్రాల వంటి నేత్రాలతో ఈ లోకపు అందాలు, అరిష్టాలు చూసిన కరుణా మూర్తి; జన సందోహంలో తనని తాను మర్చిపోయే ప్రజాహితైషి; అలసట, అనారోగ్యము అసహ్యించుకొనే కర్మయోగి, ఎంతటి విపత్కర పరిస్థితిలోను ఆత్మ విశ్వాసం చెదరనీయని దృఢచిత్తుడు.... ఇలా ఎన్నయినా చెప్ప వచ్చు నెహ్రూ గురించి. కాని, ఎంత చెప్పినా, ఇంకా చెప్పవలసినది మిగులుతూనే వుంటుంది.

—యన్నార్ చందూర్

1964 జులై 'జగతి' నుంచి పునర్ముద్రితం



